శ్రీ

# విష్ణుక్షేత్ర మార్గదర్శిని

## 108. తిరుపతుల వైభవము




సంపాదకులు

శ్రీరంగం - చిన్న సా[illegible]





చంద్రా ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1931

ఈ గ్రంథమును వలయువారు క్రిందివిలాసమునకు వ్రాయుడు.

## ఎస్. సి. స్వామి అండు సన్సు,

శ్రీ వైష్ణవ సంప్రదాయ పుస్తకవ్యాపారులు,
7, జనరల్ ముత్తయ్య ముదలివీధి,
బైరాగిమఠం గుడివద్ద,
సావుకారుపేట, మదరాసు.

క్రయం గ్లేజు కాగితములు రూ. 1 0 0
,, రఫ్ కాగితములు రూ. 0 12 0

# పీ ఠి క.



చత్వారింశత్ దివ్యదేశాః చోళదేశే ప్రకీర్తితాః
పాండ్యరాజస్యదేశేతు అష్టాదశ ఇతీరితాః
ద్వేక్షేత్రే మధ్యదేశేచ చేరదేశే త్రయోదశ
తొండమండల క్షేత్రాణి ద్వావింశతి రితిస్మృతః
ఉదీచ్యాం ద్వాదశైత్యాహుః వైకుంఠేన సమం తథా
సంఖ్యాంతు దివ్యక్షేత్రాణాం అష్టోత్తరశతం విదుః

పై శ్లోకములయందు కనుపరచినప్రకారము ఆళ్వార్లచే మంగళాశాసనము చేయబడిన శ్రీ మహావిష్ణువుయొక్క దివ్యక్షేత్రములు 108 వాటిలో చోళదేశమందు 40, పాండ్య దేశమందు 18, చేరదేశమందు 13 మధ్యదేశమందు 2, తొండ మండలమందు 22, ఉత్తరదేశమందు 12, శ్రీ వైకుంఠము 1, పూర్వకాలమందు పుణ్యక్షేత్రములకు పోవలయునంటే చాలా కష్టసాధ్యముగా నుండెను. ఇపుడు ఆ ప్రకారములేక ఆ సేతు హిమాచల మధ్యదేశ మహా దివ్యక్షేత్రములకు యాత్ర చేయువారికి సకలవిధ సౌకర్యములు ఏర్పడియున్నది. అనగా ప్రయాణము చేయువారికి రైలుబండ్లు మోటారుబండ్లు సదరు క్షేత్రములయందు దిగుటకు సత్రములు, ఆహారాదులు మొద

లగు సౌకర్యములు మెండుగా యున్నవి. వీటినంతయు ఆయా దివ్యదేశముక్రింద సంగ్రహముగా కనుపరచియున్నాము. యీ గ్రంథమును అవలోకనము చేయుటచేత ఆ యా దివ్యదేశములతో సంబంధించిన ముఖ్యవిషయములు వారివారి హృదయములకు విశదముగాను తృప్తికరముగాను వుండును. గనుక యీ గ్రంథావలోకనము చేయువారికి సదరు దివ్యదేశములను మానసికముగా స్మరించుటవల్లనైన ఆనందానుభవమును కలుగజేసి యాత్ర చేయువారికి మార్గదర్శిగానును భావహముగాను వుండును. అనేక భాగవత నియమనమును అనుసరించి యీ గ్రంథమును త్వరితముగా ముద్రించడమైనది. రెండవ కూర్పుయందు లోపములను సవరించి ప్రతి దివ్యదేశ విషయమును విస్తరించి వ్రాసెదము.



# వి ష య సూ చి క





శ్రీ రంగనాథ పెరుమాళ్లు.

శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః

# విష్ణుక్షేత్ర మార్గదర్శిని

## 108. తిరుపతుల వైభవము

## చోళదేశపు తిరుపతులు – 40

### 1. తిరువరంగం – శ్రీరంగం

శ్రీస్తనాభరణం తేజః శ్రీరంగేశయ మాశ్రయే ।
చింతామణి మివోద్వాన్తం ఉత్సంగేనన్త భోగినః ॥

సప్తప్రాకార మధ్యే సరసిజ ముకుళోద్భాసమానే విమానే
కావేరీమధ్యదేశే మృదుతరఫణి రాట్భోగ పర్యఙ్కభాగే
నిద్రా ముద్రాభిరామం కటినికటశిరం పార్శ్వవిన్యస్త హస్తం
పద్మాధాత్రీ కరాభ్యాం పరిచితచరణం రంగరాజం భజేహం

ప్రభావము :— శ్రీరంగనాథుడు, నంబెరుమాళ్లు, శ్రీరంగ నాచ్చియార్, ప్రణవాకృతి విమానము, వేదశృంగము, కావేరీనది, చంద్రపుష్కరిణి, పొన్న వృక్షము, భుజంగ శయనము, దక్షిణ తిరుముఖమండలము, ధర్మవర్మరాజునకు,

రవి వర్మరాజునకు విభీషణాళ్వానుకును ప్రత్యక్షము. పొయ్ గైయాళ్వారు, పూదత్తాళ్వారు, పేయాళ్వారు, తిరుమళిసై యాళ్వారు, నమ్మాళ్వారు, పెరియాళ్వారు, కులశేఖరాళ్వారు, తొండరడిప్పొడియాళ్వారు, తిరుప్పాణియాళ్వారు, తిరుమంగయాళ్వారు ఆండాళు మొదలగు ఆళ్వారులచే మంగళాశాసనము.

మార్గవసతులు :—ఈ దివ్యదేశము శ్రీరంగం స్టేషనుకు ¾ మైలు దూరములో యున్నది. తిరుచ్చినాపల్లి కోట స్టేషను నుండి రాజబాట మార్గముగా 3 మైళ్లదూరములోనున్న, తిరుచ్చినాపల్లి జంక్షన్ స్టేషనునుండి 6 మైళ్లదూరములో యున్నది. ఇయ్యది ప్రధానమైన మునిసిపాలిటి పట్టణమగుటచే బండ్లు విశేషముగా నున్నవి. సత్రములులేవు, రామానుజకూటములు వున్నవి. ఇండ్లు బాడుగకు తటస్థమగును. కాఫీక్లబ్బులు, భోజనశాలలు అమితముగానున్నవి, సన్నిధిలో నున్న శ్రీభండారములో స్వామి ఆరగించిన ప్రసాదములు క్రయమునకు చిక్కును.

శ్రీరంగమునకు ఈశాన్యమున 13 మైళ్ల దూరమునందు అన్బిల్ అను క్షేత్రమును, ఆగ్నేయమున 14 మైళ్ల దూరములో తిరుప్పేర్‌నగర్ అను క్షేత్రమును, ఉత్తరమున 3 మైళ్ల దూరములో కడంబనూర్ అను క్షేత్రమును, వాయువ్యమందు 10 మైళ్ల దూరములో తిరువెళ్లరై యను దివ్యక్షేత్రమును, పడమట 9 మైళ్లదూరములో గుణశేఖరమును, దక్షిణమున 3 మైళ్లదూరములో ఉఱైయూర్ అను దివ్యక్షేత్రమును

వున్నవి. ఈ దివ్యదేశమునకు ఆగ్నేయమున 1 మైలు దూర మునలో పంచభూతస్థలములలో నొకటయిన జంబుకేశ్వరము (శివస్థలము) న్ను, దక్షిణమున 3 మైళ్లదూరములో తాయుమానవర్ కొండయున్ను వున్నవి.

ఉత్సవవైభవములు :— తై, మాసి, పంగుని, చిత్రి మాసములయందు 4 బ్రహ్మోత్సవములును, మార్గళిమాసమునందు అధ్యయన మహోత్సవమగు ప్రబంధ శ్రవణ మహోత్సవమును జరుగుచున్నవి. తై నెల (మకరమాసము) యందు శ్రీరాములవారి తిరునక్షత్రమగు పునర్వసు నక్షత్రమున సమాప్తియగునట్లు 10 దినములు శ్రీరంగనాథులకు బ్రహ్మోత్సవము జరిపెదరు. ఈ వుత్సవమును అయోధ్యలో శ్రీరాములవారిచే యేర్పాటు చేయబడినది. దీనికి భూపతి తిరునాళ్ళని పేరుగల్గెను. మాసినెల (కుంభమాసం) యందు ఏకాదశిరోజు అవసానముగా గల రథోత్సవము లేని బ్రహ్మోత్సవము జరిపెదరు. రథోత్సవమునకు బదులుగా తెప్పోత్సవము జరుగుచున్నది. ఈ ఉత్సవము రామానుజులవారిచే యేర్పాటు చేయబడెను. పంగునినెల (మీనమాసం) యందు ఉత్తరా నక్షత్రము రోజు ముగింపబడు బ్రహ్మోత్సవము సత్యలోకమున బ్రహ్మ జరిపించుచుండినది గాన ఈ వుత్సవమునకు ఆది బ్రహ్మోత్సవమని పేరు. చిత్రినెల (మేషమాసం) యందు రేవతీ నక్షత్రము రోజున ముగింపబడు బ్రహ్మోత్సవము చోళరాజుచే జరుపింపబడు చుండినదిగాన తన్నామము చేతనే విరుప్పన్ తిరునాళని పేరు గల్గెను. అధ్యయనోత్సవము. ఈ వుత్సవము నమ్మాళ్వారుల సూక్తిమైన తిరువాయ్ మొళి

ప్రబంధమును తిరుమంగయాళ్వార్ల ప్రార్థనానుసారముగా శ్రీరంగనాథులు తిరుచ్చెవిశాత్తుటకు అంగీకరించి జరుపబడు వుత్సవము. ఈ వుత్సవము (రాపత్తు వుత్సవము) తిరుమంగయాళ్వార్లచే నారంభించబడినది. ధనుర్మాస శుక్లైకాదశి (వైకుంఠ ఏకాదశి) మొదలు 10 రోజులు జరిపెదరు. 10-వ దినమున నమ్మాళ్వార్ల అర్చిరాది మార్గ గమనము ప్రదర్శింపబడును. ఈ వుత్సవమునకు ముందు ధనుర్మాస శుక్ల ప్రథమ మొదలుకొని దశమిపర్యంతం తిరువాయ్మొళితప్ప తక్కిన ప్రబంధములను శ్రీ రంగనాథుడు తిరుచ్చెవిశాత్తుటకు అంగీకరించినందున శ్రీ విశిష్టాద్వైత మతోద్ధారకులైన భాష్యకారులు శ్రీ వైష్ణవ దర్శన స్థాపకులై పై సన్నిధియందు సర్వ కైంకర్య దురంధరులయి యీ పగల్పత్తు వుత్సవమును జరిపించుచుండిరి.

శ్రీరంగము కావేరీనదిచే పరివేష్టింపబడిన ఒక ద్వీపము. సన్నిధిప్రాకారములు సన్నిధియును గాక పట్టణములోని చాలా భాగమును ఆవరించియున్నవి. హిందూదేశమున ఈ క్షేత్రములోని గొప్ప ఆలయమువంటిది వేరొకచోటను లేదు. ఈ ఈ సన్నిధి 7 (ఏడు) ప్రాకారములు 15 గోపురములతో నెలకొనియున్నది. ఈ యాలయముయొక్క కోశాగారము చాలా ప్రసిద్ధి జెందినది. తిరువాభరణములు అపరిమితముగా నున్నవి. 108 దివ్య తిరుపతులలో ప్రధానమైనది. భూలోక వైకుంఠమనం దగినది. భోగమండపమనియును జెప్పంబడు ఈ దివ్యదేశమున ప్రణవాకారమైన విమానమునందు శయన తిరుకోలములో వేంచేసియున్న శ్రీరంగనాథులు ప్రథమమున

సత్యలోకమున బ్రహ్మకు తిరువారాధనముగా యుండి పాంచ రాత్రిగమ ప్రకారము ఆరాధింపబడుచుండిరి. సూర్యవంశ కులోద్భవుడైన మను పుత్రుడగు ఇక్ష్వాకు మహారాజు గొప్పతపము సలిపి బ్రహ్మను తృప్తిపరచి ఈ పెరుమాళ్లను అయోధ్యకు వేంచేపు చేసుకొనివచ్చి ప్రతిష్ఠగావించి తిరువా రాధనము చేయుచుండిరి. అనంతరము సూర్యవంశపురాజులు పారంపర్యముగా శ్రీరాముల పట్టాభిషేక మహోత్సవకాలము వరకు ఆరాధించుచుండిరి. ఆమందానంద కందళిత హృద యారవిందులై శ్రీరాములవారు యిచ్చిన శ్రీరంగనాథుని విభీషణాళ్వారు లంకాపురికి వేంచేపు చేయించుకొని పోవుచుం డగా మార్గమధ్యములో వుభయకావేరీ మధ్యలో చంద్ర పుష్కరిణీ తీరమున ప్రణవాకార విమానముతో యెత్తడము నకు సాధ్యము కానట్లు శ్రీరంగనాథుడు శయనించి యుండు టనుగని పరితపించు విభీషణాళ్వార్లు శ్రీరంగధాముని చే సంవ త్సరమున కొకరోజున నిచ్చోట నీయారాధన నంగీకరించెదనని ఆజ్ఞాపించబడి అనుజ్ఞనుపొంది లంకాపురికివెళ్లెను. పైన చెప్పినప్రకారము శ్రీరంగనాథుని ఉభయకావేరీ మధ్యమున వేంచేసి యుండడమునకు ఒక ఐతిహ్యముకలదు. పూర్వకాల మున గంగా కావేరీ వుభయులకున్ను ఎవరు గొప్పవారు అని ఒక వివాదము కల్గినది. అపుడు గంగానది గొప్పది యని బ్రహ్మచెప్పెను. పిమ్మట కావేరి బ్రహ్మనుగూర్చి తపస్సు చేసెను. బ్రహ్మ ప్రత్యక్షమై కావేరినిచూచి నీ విప్పుడు గంగకు సమాన మయితివని వరమిచ్చిరి. అంతటితో కావేరి తృప్తి జెందక సారక్షేత్రమునుచేరి విష్ణువును మిగుల భక్తితో కొన్ని

సంవత్సరములు ఆరాధించగా నా కరుణానిధి ఆమెకు ప్రత్యక్షమై నీ కేమి వరము కావలయునని యడుగగా, కావేరి, నా గర్భమందు మీా రెడతెగక యుండవలయునని వరము కోరెను. ఇది యిట్లుండగా శ్రీరాములవారి పట్టాభిషేకా నంతరము సుగ్రీవాదులు మహర్షులున్ను తమ తమ స్థలములకు వెళ్ళిరి. అపుడు శ్రీరాములవారిని విడిపోవుటకు యిష్టములేనివారై విభీషణాళ్వారు చాలా దుఃఖించిరి. అందుమీాదట శ్రీరాములవారు తమ తిరువారాధనమగు శ్రీరంగనాథుని వారికి యిప్పించిరి. తిరువారాధనను వేంచేపు చేసుకొని ఉభయకావేరీ మధ్యమునకు రాగానే అపుడు కావేరిదేవికి అచ్చటి మహర్షులకు తాము పూర్వము యిప్పించినవరముల ననుసరించి, అచటనే స్థిరముగా వేంచేసి యుండి కావేరినదికి గొప్ప మాహాత్మ్యమును కలుగజేసిరి. యీా విషయమును సవిస్తరముగా శ్రీరంగ మాహాత్మ్యమున చూడవచ్చును.

గర్భగృహము:—పెరియపెరుమాళ్లు, నంబెరుమాళ్లు, తిరువరంగ మాళిగైయార్, వేంచేసియున్నారు. బంగారు స్తంభములకు తిరుమణైత్తూన్ అనియు ప్రసాదముల నారగించు చోటునకు గాయత్రి మంటపమనియు పేరు. విమానమునకు దుర్గా గణేశులు రక్షకులు. విమాన ప్రదక్షిణమునకు తిరువణ్ణాళి ప్రదక్షిణమని పేరు, ఈ ప్రదక్షిణ ప్రాకారపు గోడయందు 108 తిరుపతుల స్వాములు చిత్రింపబడి యున్నారు. గర్భగృహ పడికట్లకు కులశేఖరప్పడి యనిపేరు. గర్భగృహ పడికట్లకు ముందుగా యుండు స్థలమునకు చందనమంటపమని

పేరు, ఇచ్చట ద్వారపాలకులు వేంచేసివున్నారు. ఈ మంటపములో అద్దాల అర (కణ్ణాడియఱై) యున్నది.

మొదటి ప్రాకారము :—చ డ ప్రచండులు (ద్వారపాలకులు) బొక్కసనాంచారు (కరువేల నాంచారు) శ్రీరంగనాథుని అంతరంగభక్తులయిన విజయరంగ చొక్కనాథ నాయకుల కుటుంబ చిత్రప్రతిమలు నాలుగు వున్నవి. యాగశాల, విరజబావి, సేన ముదలియార్ల సన్నిధి, ఈ సన్నిధియందు విభీషణాళ్వార్లు ఆంజనేయులు వేంచేసియున్నారు. అర్జునమంటపం (పగల్ పత్తుమంటపం,-ఈ మంటపములో తిరుమొళి తిరునాళ్ లేక పగల్ పత్తు వుత్సవం జరిపెదరు ఇచ్చట బీబినాంచార్ల సన్నధి యున్నది. చిలకలమంటపం-ఇచ్చటనుండి విమానములోనున్న పరవాసుదేవులను సేవింపవలయును. కణ్ణన్ సన్నధి, ఈ సన్నధియందు పచ్చయుక్క మొజలి కట్టళప్రసాదము విని యోగమగును. తిరువేంగడముడైయార్ స్వామి గోడయందు చిత్రరూపముగా వేంచేసియున్నారు, వీరు పిళ్ళైప్పెరుమాళ్ అయ్యంగారికి ప్రత్యక్షము.

రెండవప్రాకారము :—ఈ ప్రాకారమునకు విరజవీధి యనిపేరు. దొరమంటపం, వేదవిణ్ణప్పం జరుగు మంటపం, త్రిశంకు మంటపం, పరమపద వాకిలి, తిరుమడపళిగళ్ (ప్రసాదములు తళిగ చేయుచోటు) ఊంజల్ మంటపము (డోలోత్సవము జరుగు మంటపం) - ఈ మంటపమునందు ధ్వజారోహణ మండపము వున్నది. ఇచ్చట వరప్రసాదియైన ఆంజనేయుల సన్నిధియున్నది. పవిత్రమంటపం, ఇచ్చట హయగ్రీవులసన్నధి యున్నది. ఆర్యభట్టాళ్ వాశల్.

మూడవ ప్రాకారము :ఈ ప్రాకారమునకు ఆలినాడన్ తిరువీధి యనిపేరు, ఉగ్రాణము, మేల్ పట్టాభిరాముల సన్నిధి చంద్రపుష్కరిణి, పొన్న వృక్షము - ఈ వృక్షము తిరువాయ్ మొళి కాలక్షేపమువిని పెరిగినవృక్షము, కీళ్ పట్టాభిరాముల సన్నిధి, వైకుంఠనాథునిసన్నిధి, ఊరగాయలు సూర్య స్ఫుటము చేయుమంటపం, మణల్ వెళి (ఇసుక బయలు) - ఈ బయలు బదరికాశ్రమమునకు సమమయినది, బదరికాశ్రమము తిరుమంత్రము పుట్టినచోటు. ఇచ్చట తిరుమంగయాళ్వార్ దోపు వుత్సవము జరుగునపుడు స్వామి వీరికి తిరుమంత్రము వుపదేశించిన స్థలము, తిరుమళిశై యాళ్వారులసన్నిధి, శ్రీభండారము, గరుడమంటపము, (బ్రహ్మచే పంపబడిన గరుత్మంతుల సన్నిధి) - ఈ సన్నిధియందు వాలి సుగ్రీవుల విగ్రహము లున్నవి. సూర్యపుష్కరిణి, తిరుకచ్చినంబి సన్నిధి, నమ్మాళ్వారుసన్నిధి, ఈ సన్నిధియందు పొలిన్దునిన్రపిరాన్ మధుర కవియాళ్వారు, తిరుమంగయాళ్వారు వేంచేసియున్నారు.

నాల్గవ ప్రాకారము :—ఈ ప్రాకారమునకు ఆళ్వాన్ తిరుచ్చి యని పేరు. చక్రత్తాళ్వారులసన్నిధి, వసంతమంటపం. తాయార్ల సన్నిధి. శ్రీదేవి భూదేవి నీళాదేవులు ఈ సన్నిధిలో తాయార్ల వుత్సవవిగ్రహమునకు వెనుక వేంచేసివున్నారు. ఈ సన్నిధి యందున్న బిల్వవృక్షము (కలాప కాలమునందు తాయార్ల వుత్సవ విగ్రహమునుదాచి యుంచినస్థలము) ఇచ్చట నొక స్తంభములో తిరువెళ్లర పుండరీకాక్షులు వేంచేసియున్నారు. మోట్టళగర్ సన్నిధి (అష్టభుజ నరసింహుల సన్నిధి) ఐందుకుళిమూణువాశల్ (అయిదుగుంటలు. మూడు

ద్వారములు వుండుచోటు. పరవాసుదేవులసన్నిధి - వీరు రంగ నాథునికి వైద్యులని ప్రసిద్ధము. కరుత్తురై మంటపం (శివుడు పురాణకాలక్షేపము చేయుస్థలము) పెరియవాచ్చాంపిళ్ళైసన్నిధి వెయ్యికాళ్ల మంటపము - ఈ మంటపము దేవలోకమునుంచి ఐరావతముతో అలంకృతమై భూలోకమునకు శ్రీరంగనాథునికి సంగీతమంటపముగా దేవతలవల్ల పంపబడినది. ఇచ్చట రా పత్తు వుత్సవము (తిరువాయ్ మొழி తిరునాళ్) అతి వైభవ ముగా మార్గశిమాసములో జరుపబడుచున్నది. ఇందు రంగ నాయకులు వేంచేసియుండు చోటునకు తిరుమామణి మంటప మని పేరు, ముత్తరసక్కొఅడు (ముత్యాలరాజు కట్టించిన మంటపము) తైమాసములో సంక్రాంతినాడు స్వామికి ముత్యా లతో చేసిన తిరువాభరణములు, ముత్యాల చక్ర చామరా దులు, ముత్యాలదిండ్లు బల్ల మొదలగు అలంకారములతో నీ మంటపమునందు వుత్సవము జరుపబడును. శేషారాయర్ మ టపం, ఈ మంటపమునందున్న గుఱ్ఱపుచిత్రములు చూడ దగినది. పిళ్ళలోకాచార్యుల సన్నిధి, పార్థసారథిస్వామి సన్నిధి, ఉడయవరుల సన్నిధి, (పూర్వము శ్రీరంగనాథుని వసంతమంటపము) అన్ని దివ్యదేశములలో వేంచేసియున్న శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత స్థాపనాచార్యులైన శ్రీ భాష్యకా రుల అర్చావిగ్రహములన్నియు భోగ్యముగా యుండి నను ఈ సన్నిధిలో వేంచేసియుండు రామానుజులవారి యొక్క అర్చావిగ్రహము సేవించువారి హృదయమునందు నెలకొని యుందురని మణవాళ మామునులు యీడుపడి వున్నారు. ప్రతివారును ముఖ్యముగా సేవించవలయును

శ్రీరంగ విలాస మంటపము. తిరుప్పాణి యాళ్వారుల సన్నిధి విఠల కృష్ణుని సన్నిధి, తొండరడిప్పొడి యాళ్వారుల సన్నిధి, కూరత్తాళ్వారుల సన్నిధి, శ్రీ మన్నాథమునులసన్నిధి, ఆండాళ్ సన్నిధి, (ఉళ్ ఆండాళ్ ఈసన్నిధిలో పెరియాళ్వారులు వేంచేసి యున్నారు. ప్రదక్షిణ ప్రాకారమున నున్న తిరుప్పావు చిత్రపటములు చూడతగినవి) కణ్ణన్ సన్నిధి, వాహనమంటపము, ఇచ్చటగరుత్మంతుల (పెరియ తిరువడి) సన్నిధి యున్నది. కూరత్తాళ్వారుల సన్నిధిప్రక్కన నున్న గోపురము - (నాన్ముగన్ కోటవాశల్) ఇద్యాది చతుర్ముఖ బ్రహ్మవల్ల స్థాపించబడినది. రంగవిలాస మంటపముపైన ముందుభాగములో తిరుమంత్రము, ద్వయము, దీర్ఘశరణాగతియగు శ్రీరామ చరమ శ్లోకము, వరాహ చరమశ్లోకము, శ్రీ గీతాచార్యుల చరమ శ్లోకము, అవతరించిన సూచకములను ప్రతిమలుగా అమర్చబడి యున్నవి.

అయిదవ ప్రాకారము :—ఈ ప్రాకారమునకు, ఉత్తర వీధియని పేరు. తిరుత్తేరు, ఈ తిరుత్తేరునందు తై పుష్యమినాడు వుభయ నాంచారులతో స్వామి వేంచేసెదరు. ఉత్తమ నంబి తిరుమాళిగ, శ్రీరంగ నారాయణ జియ్యర్ మఠం, శ్రీ రామభట్టర్ శ్రీ అళగశింగరిభట్టర్, తిరుమాళిగలు, కోయిల్ కందాడై అణ్ణన్ తిరుమాళిగ, శ్రీమణవాళ మామునులసన్నిధి, కందాడ రామానుజమునిమఠం, శ్రీరంగరాజర్ తిరుమాళిగ, పరాశరభట్టర్ మొదలగు సన్నిధి అంతరంగ కైంకర్య నిర్వాహకుల తిరుమాళిగెలతో అలంకృతమై యున్నది.

ఆఱవ ప్రాకారము :— ఈ ప్రాకారమునకు చిత్రివీధి యని పేరు, చిత్రిమాసమునందు జరుగు బ్రహ్మోత్సవమునందు పెరుమాళ్లు ఈ వీధిగా వేంచేసెదరు. అందువల్లనే చిత్రివీధి యని పేరుగల్గెను. ఆళ్వారుల తిరునక్షత్రి దినములలో ఆళ్వారాదులు ఈ తిరువీధియందు వేంచేయుచున్నారు. ఆయనార్ తిరుమాళిగ, తిరుత్తేరు (విరుప్పుక్ తిరుప్పణి) పెరియనంబుల తిరుమాళిగ, దీనికి యెదురుగా కూరత్తాళ్వారుండినస్థలము వాధూల వంశస్థుల తిరుమాళిగ, మొదలియాండాన్ మొదలగు పూర్వులయొక్క తిరుమాళిగలు వున్నవి.

ఏడవ ప్రాకారము :— ఈ ప్రాకారమునకు అడైయవళైంజాన్ వీధి యనిపేరు. వెళియాండాళు సన్నిధి, ఈ సన్నిది వుత్సవవిగ్రహము నాల్గవప్రాకారములో నున్న ఆండాళ్ (వుళ్ ఆండాళ్) సన్నిదిలో వేంచేసియున్నారు. పడమటిద్వారముగుండా తెప్పగుంట బోవుదారియున్నది. ఈ తెప్పగుంట యందు నంబెరుమాళ్లకు మాసిబ్రహ్మోత్సవమునందు రథోత్సవమునకు బదులుగా తెప్పోత్సవము జరుగును. ఉత్తరద్వారముగుండా కొల్లడమునకు పోవుమార్గ మున్నది. కొల్లడం దక్షిణగట్టున తిరుమంగయాళ్వారుకు ప్రత్యక్షమయిన దశావతార మూర్తుల సన్నిదియున్నది. తిరుమంగయాళ్వారు వేంచేసియున్నారు. కొల్లడ మనగా చంపుచోటు అనిద్రవిడములో అర్థము. స్నానముచేయువారి పాపములు నశించిపోవును,ఇందుకు నిదర్శనము పూర్వము తిరుమంగయాళ్వారు సన్నిది కైంకర్య సహకారులను ఈ కొల్లడములో స్నానముచేయించి ముక్తులుగావించిన విషయము లోకప్రసిద్ధము. కావేరియొక్క అధిక

ప్రవాహమును కొనే చోటైనందున కొళ్ళిడమని దీనికి మరి యొక పేరు. ఈ కొళ్ళిడమందు తిరువాళ్ (తిరుమంగ యాళ్వారు) పడిత్తురై, శ్రీయాళవందారుల పడిత్తురై, శ్రీయాళవందారులను తిరుపళ్ళి చేసినచోటు, ఎల్లకరమంర పం, పడమరద్వారమునకు సమీపమున కాట్టళగశింగర్ సన్నిధియున్నది. వీరీస్థలమున పురాతనముగ వేంచేసియున్నారు. శ్రీవచనభూషణ గ్రంథ మవతరించిన స్థల మిదియే దక్షిణ గోపురద్వారముగుండా కావేరికి పోవుమార్గమున్నది. ఈ గోపురమునకు రాయగోపురమని ప్రసిద్ధము. ఇది తిరుమలనాయనిచే కట్టబడినది.



## 2. ఉఱైయూర్ – నిచుళాపురి



ప్రభావము :—అళగియ మణవాళప్పెరుమాళ్లు, వాస లక్ష్మి, వుఱైయూర్ వల్లినాంచారు, కల్యాణవిమానము, కల్యాణతీర్థము, కుడమురుట్టినది, ఉత్తర తిరుముఖమండలము, నిన్న తిరుక్కోలము (నిలువుసేవ), దేవతలకు, రవివర్మరాజునకు ప్రత్యక్షము, తిరుమంగైయాళ్వారు మంగళా శాసనము.

మార్గవసతులు :—ఈక్షేత్రము తిరుచినాపళ్ళికోట స్టేషనులోనుండి పడమట రాజబాట మార్గముగా 1 మైలు దూరములో యున్నది. బండ్లు వసతియున్నది. సత్రములులేవు. బండ్లు వున్నవి, కాఫీక్లబ్బులు వున్నవి.

తిరుప్పాణి యాళ్వార్ల అవతారస్థళము. ఈ క్షేత్ర ముందు ప్రవహించు కావేరీనదికి కుడమురుట్టియను పేరు. చోళ భూపాలుడైన ధర్మవర్మయొక్క పత్నియైన నిచుళ యొక్క నామముచేత ఈ వూరు నిచుళాపురియని నామము గల్గెను. ధర్మవర్మరాజునకు పుత్రికగా లక్ష్మి యవతరించి వాసలక్ష్మియను నామముగలదై శ్రీరంగనాధుని పెండ్లాడిన స్థలము. మేషమాసమున ఉత్తరానక్షత్రమునం దవతరించిరి. మీనమాసమున జరుగు ఆదిబ్రహ్మోత్సవ మూడవరోజున ఉఱైయూరికి శ్రీరంగనాధులు వేంచేసి వాసలక్ష్మియగు వుఱైయూర్ నాంచారుతో సహాసీనులై భక్తుల ననుగ్రహించు టయే ముందు జరిగిన వివాహమహోత్సవ ద్యోతకముగా నున్నది. శ్రీరంగ నాంచార్లకువలె వుఱైయూర్ నాచారులకున్ను అన్ని వుత్సవములున్ను శ్రీరంగ దివ్యాలయమునుంచియే జరుపబడుచున్నవి.



# 3. తంజమామణికోయిల్ – తంజావూర్



ప్రభావము :—నీలమేఘ పెరుమాళ్లు, శెంగమలవల్లి తాయారు, సౌందర్య విమానము, కన్నికాపుష్కరిణి, అమృత తీర్థము, తూర్పు తిరుముఖమండలము, వీత్తిరుంద తిరుకోలము (కూర్చున్న సేవ) పరాశర మహర్షికి ప్రత్యక్షము, పూదత్తాళ్వారు తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

తంజయాళినగరం :— నరసింహప్పెరుమాళ్లు, తంజ నాయకి తాయార్లు, వేదసుందర విమానము, సూర్యపుష్కరణి, శ్రీరామతీర్థము, తూర్పు తిరుముఖమండలం, వీత్తిరుంద తిరుకోలము, (కూర్చున్న సేవ) మార్కండేయ మహర్షికి ప్రత్యక్షము, తిరుమంగైయాళ్వారు మంగళాశాసనము.

మణికుండ్రప్పెరుమాళ్లు, అంబుజవల్లి తాయార్, మణికూడవిమానం. వీత్తిరుంద తిరుకోలం, మార్కండేయులకు ప్రత్యక్షము.

మార్గవసతులు :— ఈ 3 క్షేత్రములు తంజావూరు స్టేషనుకు ఉత్తరమున తిరువైయార్ రాజబాటమార్గముగా 2½ మైలు దూరములో దక్షిణపెన్నానది తీరమున వున్నవి. తంజావూరినందు సత్రములు వున్నవి. భోజనశాలలు (Hotels) మెండుగా నున్నవి. స్టేషనుకు సమీపమున సుందరమైన గోపురముతో కూడియున్న బృహదీశ్వరాలయము యున్నది. ఇది చూడతగిన వినోదములలో నొకటి.

తంజావూరుకు స్టేషనుకు వుత్తరమున 2½ మైలు దూరములో తంజమామణి కోయిలును, దీనికి వుత్తరమున 3 మైళ్ల దూరములో కండియూరున్ను, దీనికి వుత్తరమున 1 మైలు దూరములో ప్రసిద్ధిజెందిన శివస్థలమైన తిరువైయారును, దీనికి తూర్పున 7½ మైలు దూరములో గూడలూరును, దీనికి తూర్పున 4½ మైలు దూరములో కపిస్థలమున్ను, దీనికి దక్షిణమున 1 మైలు దూరములో పాపనాశమును దీనికి ఈశాన్యమున, 3½ మైలు దూరములో మండంగుడి(తొండరడిప్పొడియాళ్వార్

అవతారస్థలము) యును, దీనికి తూర్పున ½ మైలు దూర ములో పుళ్లంబూదంగుడియును, దీనికి ఈశాన్యమున 1 మైలు దూరములో ఆదనూరున్ను, దీనికి దక్షిణమున 1 మైలు దూర ములో స్వామిమలై (సుబ్రమణ్యస్థలము)యును,దీనికి తూర్పున 4 మైళ్ల దూరములో కుంభకోణము యున్నవి.

తంజ అను నసురిని సంహరించిన స్థలము గనుక ఈ స్థలమునకు తంజావూరను పేరుగలిగినది. ఇది చూడతగిన పట్ట ణములలో నొక్కటి.

# 4. అన్బిల్

ప్రభావము :—తిరువడివళగియనంబి, అళగియవల్లి నాచారు, తారకవిమానము, మండూకపుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, నిన్నతిరుక్కోలము, భుజంగశయనము, బ్రహ్మకు వాల్మీకిమహర్షికి ప్రత్యక్షము, తిరుమళిశై యాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—శ్రీరంగంస్టేషనుకు మూడవ స్టేష నయిన లాల్గుడి స్టేషనుకు తూర్పున ౬ మైళ్ల దూరములో యీ దివ్యదేశమున్నది. తిరుప్పేర్ నగరునకు ఉత్తరమున 2 మైళ్ల దూరములో యీ క్షేత్రమున్నది.

తిరుప్పేర్ నగరునుండి ఈ క్షేత్రమునకు రాజబాట లేదు, అందుచేత బండ్లు రాకపోకలు వుండవు, నడిచియే

పోవలసియుండును. ఈ క్షేత్రమునందు సత్రములు లేవు, భోజనశాలలు లేవు, సన్నదియందు ముందుగా చెప్పినయెడల ప్రసాదము చిక్కును.

ఈ దివ్యక్షేత్రమునకు పడమట 10 మైళ్లలో కరంబనూరును, నిరుతి దిశయందు 13 మైళ్లలో శ్రీరంగమున్ను, దక్షిణమున 2 మైళ్లలో తిరుప్పేర్ నగరును యున్నవి.



# 5. కరంబనూర్ – ఉత్తమర్ సన్నిధి



ప్రభావము :—పురుషోత్తములు, పూర్వాదేవినాంచారు, ఉద్యోగవిమానము, కదంబతీర్థము, కదళీపుణ్యావృక్షము, తూర్పు తిరుముఖమండలము, భుజంగశయనం, కదంబమహార్షికి, ఉపచరిరవసువుకు, సనకసనందాదులకు, తిరుమంగైయాళ్వారుకు ప్రత్యక్షము, తిరుమంగైయాళ్వారు మంగళాశాసనము.

ఈ సన్నిదియందు శివాలయమున్ను, బ్రహ్మాలయమున్ను, పురాతనముగా యుండు అరటిచెట్లు వున్నవి.

మార్గవసతులు:—ఈ దివ్యక్షేత్రము శ్రీరంగమునుండి వుత్తరమున యుండు తిరువెళ్లరెకు పోవు రాజబాటలో 3 మైళ్ల దూరములో యున్నది. నడిచిపోవువారు కొళ్లడము దాటి $1\frac{1}{2}$ మైలు దూరముపోయిన ఈ దివ్యదేశమును చేరవచ్చును. బండ్లు వున్నవి. సత్రములు లేవు, సన్నధియందు

ప్రసాదములు చిక్కును. దీనికి తూర్పున 10 మైళ్లలో అన్బిల్ అను దివ్యదేశమును, వాయవ్యమున 7 మైళ్ల దూరములో తిరువెళ్ళరైయును యున్నవి

# 6. తిరువెళ్ళరై – శ్వేతగిరి

ప్రభావము :—పుండరీకాక్షులు, పంకజవల్లి నాంచారు, చంపకవల్లి తాయారు, విమలాకృతి విమానము, కుశలతీర్థము, చక్రతీర్థము, దివ్యపుష్కరిణి, పుష్కలతీర్థము పద్మతీర్థము, గంధపుష్కరిణి, క్షీరపుష్కరిణి, వరాహతీర్థము, శ్వేతగిరి, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, గరుత్మంతునకు, శిబిచక్రవర్తికి, భూదేవికి, మార్కండేయులకు ప్రత్యక్షము. పెరియాళ్వారు, తిరుమంగైయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—శ్రీరంగమునకు ఉత్తరమున మణచ్చనల్లూర్ రాజబాటమార్గముగా 10 మైళ్ల దూరములో ఈ క్షేత్రము వున్నది. ఉత్తమర్ సన్నిధినుండి 7 మైళ్ల దూరములో ఈదివ్యదేశము వున్నది. బండ్లుగలవు, సత్రములు లేవు, సన్నిధియందు ప్రసాదములు చిక్కును.

ఈ దివ్య క్షేత్రమునకు శ్వేతగిరియనియును పేరు. ఉయ్యకొండారు అవతరించినస్థలము. శిబిచక్రవర్తికి వరాహరూపముతో సేవసాయించి పుట్టయందు శ్రీమన్నారాయణుండు మరిగెను. అనంతరము శిబిచక్రవర్తి ప్రార్థనచేత

ప్రయోగచక్రహస్తుడై భగవంతుడైన పుండరీకాక్షుడు సేవ సాయించెను. ఈ సన్నిధిలో మీన (పంగుని) మాసమందు బ్రహ్మోత్సవము జరుగును.

# 7- పుళ్ళంబూదంగుడి

ప్రభావము :—శ్రీవల్విలిరాములు, పొత్తామరైయాళ్ నాంచారు, శోభనవిమానము, గృధ్రతీర్థము, తూర్పు తిరుముఖమండలము, భుజంగశయనము, శ్రీరాములవారికి ప్రత్యక్షము. గృధ్రరాజునకు ప్రత్యక్షమై మోక్షమిచ్చినస్థలము, తిరుమంగైయాళ్వార్ల మంగళాశాసనము.

మార్గవసతులు :—స్వామిమలై స్టేషనుకు నైరుతి దిశయందు 2 మైళ్లదూరములో యీ దివ్య దేశమున్నది. సుందర పెరుమాళ్కోవిల్ స్టేషనుకు వుత్తరమున మంటిబాట మార్గముగా 3 మైళ్ళ దూరములో నున్న కణ్ణంజేరికి తూర్పుగా $\frac{1}{2}$ మైలు దూరములో ఈ దివ్యక్షేత్రమువున్నది. మధ్యలో 2 చిన్న నదులను దాటవలయును. బండ్లు దొరకవు, సత్రములు లేవు, భోజనశాలలు, కాఫీక్లబ్బులు లేవు, సన్నిధియందును ప్రసాదము చిక్కడము అరుదు.

ఈ క్షేత్రమునకు తూర్పున 6 మైళ్ళదూరములో కుంభకోణమును, పడమట 1 మైలు దూరములో మండంగుడియును, ఉత్తరమున $\frac{1}{2}$ మైలు దూరములో ఆదనూరును వున్నవి.

# 8. తిరుప్పేర్ నగర్ — కోవిలడి



ప్రభావము :—అప్పక్కొడుత్తాన్ పెరుమాళ్, కమలవల్లి తాయార్, ఇంద్రవిమానము, ఇంద్రతీర్థము, ఇంద్రగిరి, పశ్చిమ తిరుముఖమండలము, భుజంగశయనము, కుడిహస్తము క్రింద కుంభము, ఉపమన్యువుకు, పరాశరులకు ప్రత్యక్షము, తిరుమళిశైయాళ్వారు, నమ్మాళ్వారు, పెరియాళ్వారు, తిరుమంగైయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—విళిప్పురం - తిరుచ్చినాపల్లి కార్డులైను మార్గములోనున్న లాల్గుడిస్టేషనుకు తూర్పున రాజబాటమార్గముగా 5 మైళ్ళలోనున్న అన్బిల్ అను క్షేత్రమునకు పోయి అచ్చటనుండి కొల్లిడమును దాటిపోయినయెడల ఆకొల్లిడము దక్షిణగట్టునయుండు యీ దివ్యదేశమును జేరవచ్చును. తంజావూరికిపడమట 11 మైళ్ల దూరములోయున్న బూదలూరు స్టేషనుకు వుత్తరమున రాజబాటమార్గముగా 3 మైళ్లదూరము లోయుండు తిరుకాట్టుపల్లి నిచేరి అచ్చటనుండి పడమటకావేరి వుత్తరగట్టున మంటిబాటమార్గముగా 5 మైళ్ల దూరముపోయి ఈస్థలము చేరవలయును. బంగ్లు, సత్రములు గలవు, భోజనశాలలులేవు, సన్నిధియందు దేశాంతరులకు ప్రసాదములభించును. ఈ క్షేత్రమునకు పడమట 5 మైళ్ల దూరములోనున్న కావేరి నదియొక్క మధ్య అవకట్టు చూడదగినది. ఈ క్షేత్రమునకు వుత్తరమున 2 మైళ్ల దూరములో అన్బిల్ అను దివ్యదేశము వున్నది.



# 9. ఆదనూర్



ప్రభావము :—ఆణ్డాళక్కుమెయ్యన్ పెరుమాళ్, శ్రీరంగనాయకినాంచారు, ప్రణవవిమానము, సూర్యపుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, భుజంగశయనము, కామధేనువుకు తిరుమంగైళాళ్వారుకు ప్రత్యక్షము. తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము.

మార్గవసతులు :—కుంబకోణమునకు పడమట 4 మైళ్ల దూరములో నున్న స్వామిమలైనుండి కాలిబాటమార్గముగా 1 మైలు దూరములో ఈ క్షేత్రము వున్నది. స్వామిమలైనుండి రాజబాటమార్గముగా 4 మైళ్ల దూరములో యీ దివ్యదేశమున్నది.

కుంబకోణమునకు పడమర 2 మైళ్ల దూరములోనున్న ధారాసురము స్టేషనుకు పడమట రాజబాటమార్గములో యున్న తిరువలంశుళి యను శివస్థలమును చేరవలయును. అచ్చటనుండి వుత్తరమున 1 మైలు దూరములోయున్న స్వామిమలై యను వూరికి వుత్తరమున కాలిబాటమార్గముగా పోయి ఈ క్షేత్రమును చేరవచ్చును. సత్రములులేవు, చిన్న గ్రామము, బండ్లుగలవు, మేదిన్ని చిక్కదు.

కామధేనువుకు ప్రత్యక్షమైన స్థలమగుటచేత యీదివ్యదేశమునకు ఆదనూర్ అని తిరునామము గలిగెను.



# 10. తిరువళ్లుందూర్ – తేరళ్లందూర్



ప్రభావము :—ఆమరువియప్పన్, శెంగమలవల్లి తాయారు, గరుడవిమానము, దర్శనపుష్కరిణి, తూర్పుతిరుముఖ మండలము, నిన్నతిరుక్కోలము, ఉపరిచరవసురాజునకు, కావేరికి, ధర్మదేవతకు ప్రత్యక్షము. తిరుమాంగై యాళ్వార్ మంగళాశాసనము. ఇయ్యది వడగల సన్నిధి. సన్నిధివీధి యందు శ్రీరంగనాథుల సన్నిధియు, గోవిందరాజుల సన్నిధి యును వున్నవి. ఈ రెండు సన్నధులు తెంగలవారి స్వాధీనములో నున్నవి.

మార్గవసతులు :—ఇయ్యది మాయవరమునకు పడమట 5 మైళ్ల దూరములోనున్న కుత్తాళంస్టేషనుకు ఆగ్నేయమున 3½ మైలు దూరములో నున్నది. మాయవరమునుండి నిరుతి దిశయందు మంటిబాటమార్గముగా 7 మైళ్ల దూరములో యున్నది. సత్రములు బండ్లు గలవు. భోజనశాలలు లేవు. సన్నిధియందు అందరికిన్ని ప్రసాదము లభ్యమగును. కుత్తాళములో సత్రములును, భోజనశాలలు వున్నవి.

ఇచ్చట వైయ్యాశి నెలయందు జరుగు బ్రహ్మోత్సవము హస్తానక్షత్రమునాడు తీర్థోత్సవము జరుగుచున్నది.

ద్రావిడకవులలో శ్రేష్ఠుడయిన కంబకవి అవతరించిన స్థలమిదియే.



# 11. తిరుప్పులియూర్

ప్రభావము:—అరుమాకడల్ పెరుమాళ్, తిరుమామగళ్ నాంచారు, నందవర్ధన విమానము, అనంతసరస్సు, మానసపుష్కరిణి, దక్షిణ తిరుముఖమండలము, భుజంగశయనము, వ్యాస మహర్షికి, వ్యాఘ్రపాద మహర్షికి ప్రత్యక్షము. తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యాది మాయవరమునుండి తిరువాలూరుకు పోవుమార్గమునవున్న కొల్లుమాంగుడి స్టేషనుకు చేసిగట్టులమార్గముగా 1 మైలుదూరములోనున్న దిఃమంగనల్లూరుస్టేషనుకు ఆగ్నేయదిశయందును, పేరళంస్టేషనుకు ఈశాన్యమునను, రాజబాటమార్గముగా 3 మైళ్ల దూరములో ఈ దివ్యదేశముయున్నది. బండ్లుగలవు, సత్రములు లేవు, భోజనశాలలు లేవు, సన్నధియందు ప్రసాదములు చిక్కును.

వ్యాఘ్రపాదమునికి పెరుమాళ్లు సేవసాధించిన స్థలము. ఇచ్చోట శ్రీమన్నారాయణుడు బాలశయనముగా సేవసాయించుచున్నారు.

# 12. తిరుచ్చేరై–సారక్షేత్రము

ప్రభావము:— సారనాథపెరుమాళ్లు, సారనాయకి తాయారు, సారవిమానము, సారపుష్కరిణి, తూర్పు తిరు

ముఖ మండలము, నిన్న తిరుకోలము, కావేరికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—కుంబకోణం స్టేషనుకు ఆగ్నేయమున కూడువాసల్ అను ద్వారికి పోవు రాజబాటమార్గముగా 6 మైళ్ళదూరములో నుండు నాచ్చియార్ కోవిల్ చేరవలెను. అచ్చటనుండి దక్షిణమున 3 మైళ్ల దూరముపోయి ఈ క్షేత్రము చేరవలయును. కుంబకోణమునకు ప్రక్కనయుండు తిరునాగేశ్వరం స్టేషనుకు 4 మైళ్లదూరములో నున్న నాచ్చియార్కోవిలు (తిరునరైయూరుకు) దక్షిణమున 3 మైళ్ల దూరములో ఈ క్షేత్రము వున్నది. బండ్లువున్నవి. భోజనశాలలు లేవు, సన్నిధియందు ప్రసాదము చిక్కును.

# 13. తలైచ్చంగనాణ్మదియం
## (తలైచ్చంగాడు)

ప్రభావము :—నాణ్మదియప్పెరుమాళ్, వెణ్శుడర్ పెరుమాళ్, తలైచ్చంగనాంచారు, శెంగమలవల్లి తాయారు, చంద్రవిమానము, చంద్రపుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, దేవతలకు చంద్రునికి ప్రత్యక్షము, పూదత్తాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది శియ్యాళి స్టేషనుకు ఆగ్నేయముననున్న తరజ్గంబాడికి పోవు రాజబాటమార్గముగా 10 మైళ్ల దూరమునం దున్నది. మాయవరం స్టేషనుకు తూర్పు

ననున్న తరఙ్గంబాడికి పోవు రాజబాటమార్గముగా 7 మైళ్లు దూరములోనున్న శంబానార్ కోవిల (శివస్థానము) కు పోయి అచ్చటనుండి వుత్తరముగ మంటిబాటమార్గముగా 5 మైళ్లదూరము పోయిన ఈ స్థలమును శేరవచ్చును. బాడ్లు వున్నవి, సత్రములు భోజనశాలలు లేవు, సన్నిధియందు ప్రసాదము చిక్కుటరుదు.

## 14. కుంబకోణము – తిరుక్కుడందై

ప్రభావము:—సారంగపాణిపెరుమాళ్ (ఆరావముదన్) కోమళవల్లి తాయారు, వైదికవిమానము, హేమపుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, ఉద్యోగశయనము, హేమమహర్షికి ప్రత్యక్షము, పూదత్తాళ్వారు, పేయాళ్వారు, తిరుమళిశైయాళ్వారు, నమ్మాళ్వారు, పెరియాళ్వారు, తిరుమంగయాళ్వారు, ఆండాళు మంగళాశాసనము.

తిరుమళిశై యాళ్వారు తిరునాడలంకరించిన చోటిదియే. ఆళ్వార్ సన్నిధి సారఙ్గపాణిసన్నిధికి పడమట వేరుగా యున్నది, తెంగలవారి యాధీన మందున్నది. సారఙ్గపాణి సన్నిధి వడగలవారి స్వాధీనములో యున్నది.

ఉత్సవములు:—తైమాసం 1-వ తేది మొదలుకొని 10 దినములు సంక్రాంతి బ్రహ్మోత్సవమున్ను, చిత్రినెలయందు 1 బ్రహ్మోత్సవమున్ను జరుగుచున్నది.

మార్గవసతులు :—కుంబకోణం స్టేషనుకు పడమట 1 మైలు దూరములో ఈ సన్నిధియున్నది. ఇయ్యది పెద్దనగరముగా నుండుటచే బస్లు విశేషముగా నున్నవి, సత్రములు కాఫీ క్లబ్బులు భోజనశాలలు అమితముగా యున్నవి. దీనికి పడమట 4 మైళ్ల దూరములో స్వామిమలైయును, 6 మైళ్ల దూరములో ఆడనూరును, 5 మైళ్ల దూరములో పుళ్లంబూదఙ్గుడియును, దక్షిణమున 2 మైళ్ల దూరములో నందిపురవిణ్ణగరమున్ను, తూర్పున 4 మైళ్ల దూరములో తిరువిణ్ నగరమున్ను, దక్షిణమున 4 మైళ్ల దూరములో తిరునరైయూరు నాచ్చియార్కోవిల్ను యున్నవి.

కుంబకోణము పూర్వమున చోళరాజ్యమునకు ముఖ్యపట్టణము. దీనిని ఆంగ్లేయులు (Oxford of Southern India) అని చెప్పుదురు. ఈ నగరమందు అనేక విష్ణ్వాలయములు శివాలయములు గలవు, విష్ణ్వాలయములలో సారంగపాణి సన్నిధి, చక్రపాణి సన్నిధి, రామస్వామి సన్నిధి, వరాహనాయనార్ సన్నిధి ముఖ్యమైనవి. బ్రహ్మాలయమొకటిన్ని, సూర్యాలయమొకటిన్ని యున్నవి. సారఙ్గపాణి సన్నిధి గోపురము 147 అడుగులయెత్తు. కుంభేశ్వరర్ కోయిల్ గోపురము 128 అడుగుల పొడవు. ఇత్తడి, కంచు, సీసపాత్రములు చేయుట యందు ఈ నగరము ప్రసిద్ధిజెందినది.

ఈ స్థలమందు మహామఖకుళం అను పెద్దకుంట యున్నది. 12 సంవత్సరముల కొక పర్యాయము మహామఖోత్సవము ఇచ్చట జరుగుట ప్రసిద్ధి. ఈ వుత్సవమునకు

సుమారు ఆరు లక్షలజనులు విచ్చేయుదురు. ఈ నగరమున కుత్తరమున కావేరినది ప్రవహించుచున్నది.

## 15. కండియూర్

ప్రభావము:—హరునిశాపము తీర్చిన పెరుమాళ్లు, కమలవల్లి తాయారు, కమలాకృతి విమానము, కపాలతీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, రుద్ర కపాలవిమోచనస్థలము, అగస్త్యమహామునికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

ఈ దివ్యస్థలమందు రుద్రహస్తగతమైన బ్రహ్మకపాల మోక్షము భగవంతుడు చేసెను.

మార్గవసతులు:—తంజావూరు స్టేషనునుండి వుత్తరమున తిరువైయారుకు పోవు రాజబాటమార్గములో 2½ మైలు దూరమునందున్న తంజమాపుణికోయిలకు వుత్తరమున 3¼ మైలు దూరములో ఈక్షేత్ర మున్నది. కుంబకోణమునకు దక్షిణమున 19 మైళ్ల దూరములో నున్న తిట్టై స్టేషనునుండి 3¼ మైళ్లు దూరములోనున్న తంజావూరు రాజబాట సంధించు చోటయిన పళ్లి అగ్రహారమునకు వుత్తరమున తిరువైయారుకు పోవు రాజబాట మార్గముగా 3½ మైలు దూరమునందు ఈ క్షేత్రమున్నది. బండ్లుగిలవు, సత్రమున్నది, భోజనశాలలు లేవు, సన్నిధియందు ప్రసాదము చిక్కును.

# 16. తిరువిణ్ణగర్

ప్రభావము :—ఉప్పలియప్పన్, భూదేవినాంచారు విష్ణువిమానము, ఆర్తిపుష్కరిణి, తూర్పుతిరుముఖ మండలము నిన్న తిరుకోలము, మార్కండేయులకు, గరుత్మంతునికి కావేరికి, ధర్మదేవతకు, ప్రత్యక్షము. పొయ్గైయాళ్వారు, పేయాళ్వారు, నమ్మాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళ శాసనము. ఈ క్షేత్రమునకు తులసీవనమని నామధేయము గలదు.

మార్గవసతులు :—కుంబకోణం స్టేషనుకు తూర్పున మంటిబాటమార్గముగా 3 మైళ్ల దూరమున ఈక్షేత్రమున్నది. బండ్లుగలవు, సత్రమున్నది, భోజనశాలలు లేవు, సన్నిధియందు ప్రసాదములు చిక్కును. తంజావూరుజిల్లాకు తిరుపతి దివ్య క్షేత్రమువలె యుంటున్నది. ఈ సన్నిధికి ప్రార్థనలు చెల్లించు టకు వందలకొలది జనులు వచ్చుచునే యుందురు.

పూర్వమున ఈ క్షేత్రమందు మార్కండేయులు తప ము చేయుచుండు కాలమున చక్కని చిన్నబాలికను పెంచు చుండిరి. మార్కండేయులు ఆశ్రమమందు లేని తరుణమున ఈ సన్నిధి పెరుమాళ్లు మనుష్యరూపము ధరించి ఆశ్రమము నకు వేంచేసి ఆ బాలికను తిరుకల్యాణము చేసికొనిరి. మార్కండేయులు ఆశ్రమమునకు తిరిగివచ్చిన తరుణమందు వధూవరులను వీక్షించి కోపముజెంది శపింపపోగా మనుజ రూపముతోయుండు విష్ణువు తన నిజరూపమును గాన్పించిరి.

వెంటనే ఆ తపోవరుండు సేవించి సంతోసించి స్వామీ ఈ బాలి కకు వంటచేయుటలో ఉప్పువేయడమునకుగూడా తెలియదే, మిక్కిలి చిన్న వయస్సుగలదిగా నున్నదే యయిన శ్రీమన్నారాయణుండు ఆ చిన్నది నా భార్యగా యుండనిమ్ము. నేడు మొదలు వుప్పులేని ప్రసాదమును ఆరగించెదను, ఇకమీదు ఈ సన్నిధియందు ఉప్పువాసననే యుండకూడదు; ఈ సంగతిని తెలియనివా రెవరైనను ఉప్పుతెచ్చినయెడల నాగుపాము దృశ్యమై వారిని సన్నిదిలోనికి రానీయక అడ్డగించి వా రా వుప్పును సన్నిధికిబైట పారవేయునంతవరకు అడ్డపడి యుండునని యానతిచ్చిరి. ఈ కారణంబుచేత వీరికి ఉప్పిలియప్పన్ అను తిరునామము గల్గెను.

ఈ సన్నిది పెరుమాళ్లు ఉప్పులేని ప్రసాధములను ఆరగించెదరు. కొన్ని సంవత్సరములకు ముందు ధనవంతుండొక్కడు తన బంధువులతోడ ఈ దివ్యక్షేత్రమునకు వచ్చెను. వారు సన్నిధిలోపల గరుడస్థంభమును సమీపించినపుడు నాగుపా మొకటి వున్నట్లుండి కనబడి దారికడ్డముగా తన పడిగెను విప్పి బుసకొట్టుచుండెను. ఆ తరుణమున సన్నిధియర్చకులు వీర్లనుజూచి మీలో యెవరివద్దనైనా ఉప్పుయుండినయెడల దానిని పారవేయుడు, అని తెలియజేయగా వారిలో నొకరు తమవద్దనున్న ఉప్పును తక్షణమే పారవైచిరాగా తక్షణమే సర్పము అదృశ్యమాయెను. పిదప వారికి పై సవిస్తారమును అర్చకులు దెలిపిరి.

# 17. తిరుకణ్ణపురమ్

ప్రభావము :—శౌరి రాజ ప్పెరుమాళ్లు, కణ్ణపురినా యకి, ఉత్పలావర్తకవిమానము, నిత్యపుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, కణ్వమహామునికి ప్రత్యక్షము. నమ్మాళ్వారు, కులశేఖరాళ్వారు, పెరియాళ్వారు, తిరుమంగయాళ్వారు, శ్రీయాండాళ్ మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది నన్నిలం స్టేషనుకు తూర్పున 3¼ మైలు దూరములోనున్న తిరుక్కాగలూరునకు దక్షిణమునన్నున్న కావేరీనదిని దాటి 1 మైలు దూరముపోయి యీ దివ్యదేశమును చేరవలయును. సత్రముకలదు, భోజనశాల లేదు, సన్నిధియందు ప్రసాదము లభ్యమగును.

ఉత్సవములు :—మాశి నెల మఖానక్షత్ర దినము అవసానముగానున్ను, వైయ్యాశి నెలలో శ్రవణ నక్షత్రము అవసానముగానున్ను, 2 బ్రహ్మోత్సవములు జరుగుచున్నవి. పగల్ పత్తు రాపత్తు (అధ్యయన) వుత్సవము ఈ సన్నిధియందు మిక్కిలి విశేషముగా జరుపబడుచున్నది. మాశిమాసమందు జరుగు తీర్థోత్సవము నాగపట్టణమునకు సమీపమున నుండు తిరుమలరాయన్ పట్టణ ప్రాంతమున సముద్రతీరమునందు జరుపబడుచున్నది.

కాయచ్చీరామవిణ్ణగరము, చిత్రకూటము, తిరువారూర్, తిరువణ్ణామలై మొదలగు విష్ణు ఆలయములను ఇద

గొట్టి లింగప్రతిష్ఠ గావించుచుండిన క్రిమికంఠచోళుడు, తిరు కణ్ణపురమునకువచ్చి సన్నిధి 6 ప్రాకారములను ఇడగొట్టి తిరుమగల్, తిరుప్పుగలూర్ మొదలగు శివాలయములను కట్టె ను. పిదప 7-వ మదులునుగూడ యిడగొట్ట యత్నించుసమయ మున తిరుకణ్ణపురముఅరయరుస్వామిముందు ద్రావిడప్రబంధ మును గానము చేయునపుడు మిగుల చింతించుచు ఓకరుణాకరా పాపాత్ముడయిన చోళుడు 6 మదుళ్లను నాశము చేసెను. 7-డవ మదులునుగూడ నాశము చేయుబోవుచున్నాడు. పూరకచూచు చున్నావే, నీకు కండ్లు లేదా యని విన్నపించిరి, అప్పటికి స్వామి మౌనముగా యుండుటను సహించజాలక చేతిలో నున్న తాళమును స్వామి తిరుమేనియందు విసిరివేయుగా, తత్క్ష ణామే పెరుమాళ్ల చేతిలోనున్న చక్రాయుధముపోయి చోళుని శిరమును ఖండించి సముద్రమునందు స్నానముచేసి మరల స్వామి హస్తమందు జేరెను. ఇందులకు నిదర్శనముగా యిప్ప టికిని ఆ 6 మదుళ్ల అస్తిభారములును, శ్రీశౌరిరాజ పెరుమాళ్లు తిరుముఖ మండలమునందు తాళముయొక్క దెబ్బవలని బొబ్బ యును, పెరుమాళ్లు ప్రయోగచక్రమును ధరించియుండుటయు ప్రత్యక్షము.

వయలాళి మణవాళ పెరుమాళ్లవద్ద మంత్రోపదేశము పొందిన తిరుమంగయాళ్వారు ఆ మంత్రముయొక్క సిద్ధిని ఇచ్చ టనే పొందిరి. ఇచ్చట గరుత్మంతులు గొప్ప తపముచేసి పొందినవరమువల్ల పెరుమాళ్లకు యెదురుగా వాహనరూప ముగా వేంచేసియున్నారు. వీరికి అనుదినము తిరువారాధన జరుగుచున్నది.

పెరియపెరుమాళ్ల(రంగనాథుల)నియమనమువల్ల యీ స్థలమున విభీషణాళ్వారుకుగాను ప్రతి అమావాస్యనాడును దక్షిణ తిరుముఖ మండలముగా శౌరిరాజపెరుమాళ్లు సేవ సాధించుచున్నారు. వీరు ప్రతినిత్యము రాత్రికాలములందు ఆరగించు మునియోధరుని పొంగిలి (ఆళాకుబియ్యం, ఆళాకు నెయ్యి మొదలగు వానితో పొంగలిచేసి మునియోదరుడు స్వామికి ఆరంగింపు చేసెను. అందుకు నిదర్శనముగా యిప్పటికిని రాత్రికాలములయందు ఈ పొంగిలిచేసి స్వామికి ఆరగింపు చేసెదరు.) యను ప్రసాదము సామాన్యమైనిదిగాక సర్వ్వులకున్ను ఔషధముగా నుండును.

## 18. తిరువాలి – తిరునగరి

ప్రభావము :—వయలాళి మణవాళప్పెరుమాళ్లు, అమృతఘటవల్లి నాంచారు, అష్టాక్షరవిమానము, ఇలాక్షణి పుష్కరిణి, అలాతని పుష్కరిణి, పశ్చిమ తిరుముఖమండలము, పిత్తిరుంద తిరుకోలము, అలాతని, కంజమ ప్రజాపతికిని, తిరుమంగ యాళ్వారుకున్ను ప్రత్యక్షము, తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది శియ్యాళి స్టేషనునుండి ఆగ్నేయ దిశగా రాజబాటమార్గముగానున్న, మంటిబాట మార్గముగానున్న 6 మైళ్ల దూరములో యున్నది. బండ్లు పున్నవి, సత్రమున్నది, భోజనశాలలు లేవు, రామానుజకూటము పున్నది. సన్నిధియందు ప్రసాదములు చిక్కును.

తిరువాలి తిరునగరి యనునది తిరువాలి యనియును, తిరునగరి యనియును 2 తిరుకతులు. తిరువాలినుండి తిరునగరి రెండుమైళ్లు దూరమునందున్నది. తిరునగరియందు వయలాలి మణవాళర్ సన్నిధియును, తిరుమంగయాళ్వారు సన్నిధియును యున్నది. తిరువాలియందు నరసింహస్వామి సన్నిధి యున్నది. తిరువాలికి దక్షిణమున 4 మైళ్లు దూరములో తిరునాంగూరు యున్నది.

ఉత్సవ వైభవములు :—పెరుమాళ్లకు పంగునిమాసము ఉత్తరానక్షత్రము అవసానముగా 10 దినములు బ్రహ్మోత్సవము జరుగుచున్నది. తిరుమంగయాళ్వారుకు కార్తీకమాసమునందు కృత్తికానక్షత్రము అవసానముగా 10 దినములు వుత్సవము అతి విమర్శగా జరుగుచున్నది. పంగునినెలలో జరుగు వుత్సవమందు 8-వ దినము పెరుమాళ్లు నాచ్చియారుతో తిరుకల్యాణ మహోత్సవ వైభవములో వేంచేయుచున్న తరుణమందు రాత్రి 11 ఘంటలకు బాణవేడుకలతోటి మత్తాపులు దీవిటీలతో ఆళ్వార్లు ఆడల్‌మా అను అశ్వారూఢులై మంత్రులతో సహితము తిరువరసు (రావిచెట్టు) క్రింద పొంచియుండి పెరుమాళ్లు నాచ్చియార్ల తిరువాభరణములను అపహరించు తరుణములో జరుపు ప్రశ్నోత్తరములును వార్తలున్ను పాశురములున్ను సేవించిన అనంతరము పెరుమాళ్లు పిరాట్టి సహితముగా గరుడవాహనారూఢులై సేవసాయించు వేడుపరి వుత్సవము మిక్కిలి వినోదకరముగానుండును.



# 19. తిరునాగై—నాగపట్టణము



ప్రభావము:—సౌందర్యరాజ ప్పెరుమాళ్లు, సౌందర్య వల్లి తాయారు, సౌందర్య విమానము, సార పుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకో్కలము, నాగరాజునకు, తిరుమంగయాళ్వారుకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—నాగపట్టణం స్టేషనుకు వాయవ్య మున 1 మైలుదూరములో స్వామిసన్నిధి వున్నది. 2 సత్రము లున్నవి. బండ్లుగలవు, భోజనశాలలు, కాఫీక్లబ్బులు వున్నవి. ఇచ్చట 2 గొప్ప శివాలయములు వున్నవి. ఇచ్చటికి పడమట రాజబాట మార్గముగా 5 మైళ్ల దూరములోనున్న ఆళియూరు నకు దక్షిణమున 1 మైలు దూరములో తిరుకణ్ణంగుడి యను దివ్యక్షేత్ర మున్నది.

ఉత్సవవైభవములు :—ఫంగుని మాసం ఉత్తరానక్ష త్రము అవసానముగా 10 దినములు బ్రహ్మోత్సవము జరు గును. నాగరాజునకు ప్రత్యక్షమైన స్థలముగాన ఈ క్షేత్ర మునకు నాగపట్టణము అను పేరు గలిగెను. ఈ స్థలమునకు వుత్తరమున 4 మైళ్ల దూరములో మహమ్మదీయుల క్షేత్ర మైన నాగూరు యున్నది.



# 20. తిరునరైయూర్

## (నాచ్చియార్ కోవిల్)



ప్రభావము :—నంబి పెరుమాళ్లు, నంబిగై నాంచారు శ్రీనివాస విమానము, మణిముక్తా నది, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుక్కోలము, మేదవమునియొక్క కన్యకను బలిమి పట్టుకొనిపోగా వానిని శిక్షించి మేదవమునికి కృపచేసిన స్థలము. తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది కుంబకోణం స్టేషనుకు ఆగ్నేయమునసుండు కూడవాసలుకు పోవు రాజబాట మార్గముగా 6 మైళ్ల దూరములో యున్నది. ఈ దివ్యదేశమునకు దక్షిణమున 3 మైళ్ల దూరమునందు తిరుచ్చేరై యున్నది. సత్రమున్నది, భోజన శాలలు వున్నవి, బండ్లుగలవు.

రాక్షసుడు అపహరించుకొనిపోయిన వైరముడిని వైనతేయులు (పెరియ తిరువడి) జయించి తీసుకొని వచ్చుచుండగా ఇచ్చటనున్న రాక్షసు డొక గ్రా పక్షిరాజుతో సంగరము జేయు తరుణమందు వైరముడి (కిరీటము) యందున్న మాణిక్య శిఖరము అచ్చట పాఱుచున్న నదియందుపడెను. అందువలన ఆ నదికి మణిముక్తానది యని పేరుగలిగెను. ఇప్పటికిన్ని స్వామి కిరీటము శిఖరములేకనే బోడిగా నున్నది. ఈ సన్నిధియందు వాహనరూపముగా రాతి గరుడవాహనము యున్నది. వీరికి ప్రార్థనలు మొదలగునవి చెల్లించెదరు. ఈ వాహనమును ఆ స్థానమునుండి 4 అర్చకులచే బైటికి వేంచేపు చేయించినపిమ్మట,

16 బ్రాహ్మణులచేత వాహన మంటపమునకు తీసుకొనివచ్చి, 32 బ్రాహ్మణులచేత మహామంటపమునకు తీసుకొనివచ్చి, పెరుమాళ్లను వేంచేపుచేయించి 200 శ్రీపాదతాంగులచేత తిరువీధి వుత్సవములు జరుపుచున్నారు. మార్గళి నెల ముక్కోటి ద్వాదశి యుదయమున ఒక సారియు, మాశి బ్రహ్మోత్సవమున 5 వుత్సరము నాటిరాత్రి మరొకసారియు స్వామిని ఈ గరుడవాహనముమీద వేంచేపు చేయించెదరు.



## 21. నందిపుర విణ్ణగరం – నాథన్‌కోయిల్



ప్రభావము :—విణ్ణగరప్పెరుమాళ్, జగన్నాథులు, నాథనాథ పెరుమాళ్లు, చంపకవల్లి తాయారు, మందార విమానము, నంది తీర్థము, పశ్చిమ తిరుముఖమండలము, వీత్తిరుంద తిరుక్కోలము, నందికి, శిబి చక్రవర్తికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :— కుంబకోణమునకు దక్షిణమున మంటిబాట మార్గముగా 3 మైళ్ల దూరములోనున్న నాచ్చియార్ కోవిలకు పడమట 3 మైళ్ల దూరములో ఈ దివ్యదేశ మున్నది. ఈ క్షేత్రమునకు తూర్పుగ 1 మైలు దూరములో నందివనమను చోట పెరుమాళ్ల సన్నిధి శిథిలముగానున్నది. బండ్లుగలవు. సత్రములు భోజనశాలలు లేవు.



## 22. తిరువిందళూర్ – తిరువళందూరు



ప్రభావము :—సుగంధవన నాథప్పెరుమాళ్లు, మరు వినియమైంద ప్పెరుమాళ్లు, పరిమళరంగన్, చంద్రశాప విమోచన నాచ్చియారు, పుండరీకవల్లి నాచ్చియారు, వేదచక్ర విమానము, చంద్ర పుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, వీరశయనము, చంద్రునికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—మాయవరం స్టేషనుకు వుత్తరమున మంటిబాట మార్గములో ఈ దివ్య దేశమున్నది. బండ్లు గలవు. సత్రములు భోజనశాలలు వున్నవి. మాయవరం స్టేషనుకు తూర్పున 2 మైళ్ల దూరములో మైలాడుదురై యను శివస్థలమున్నది. ఇచ్చట తులా మాసమునందు కావేరీస్నానము బహు విశేషము, ఫంగుని నెలయందు హస్తానక్షత్రము అవసానముగా 10 రోజులు బ్రహ్మోత్సవము జరిపెదరు.



## 23. తిరుచ్చిత్రకూటము

### (తిల్లై చిదంబరం)



ప్రభావము :—శ్రీ గోవిందరాజప్పెరుమాళ్లు, పుండరీకవల్లి తాయారు, సాత్త్విక విమానము, పుండరీకసరస్సు, తూర్పు తిరుముఖమండలము, భోగశయనము, శివుడు మొదలగు

తిల్లై మూడు వేలమందికిన్ని, కణ్వామహామునికిన్ని ప్రత్యక్షము. దేవతలు కొలువు వుంచబడిన స్థలము, కులశేఖరాళ్వారు, తిరు మంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది చిదంబరం స్టేషనుకు వాయవ్యమున రాజబాట మార్గముగా 1 మైలు దూరములో చిదంబరం శివాలయములో వున్నది. బండ్లుగలవు. సత్రములు విశేషముగా నున్నవి. కాఫీక్లబ్బులును, భోజనశాలలు అమిత ముగ నున్నవి. ఇచ్చటికి పడమట 24 మైళ్ల దూరములో స్వయంవ్యక్త స్థలములైన శ్రీముష్ణమును, నైరుతిదిశయందు 16 మైళ్ల దూరములో కాట్టుమన్నార్ కోవిలును యున్నవి. ఈ దివ్యదేశములకు పోవుటకు బండ్లు, మోటారుబస్సులును వున్నవి.

## 24. శ్రీరామవిణ్ణగరమ్ – శీరాళి

(కాళచ్చీ రామ విణ్ణగరం)

ప్రభావము:—తాడాళప్పెరుమాళ్, త్రివిక్రమమూర్తి, మట్టవిళుంకుళవి నాచ్చియారు, పుష్కలావర్తక విమానము, చక్రతీర్థము, శంఖ పుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, అష్టకోణమహర్షికి ప్రత్యక్షము, తిరు మంగయాళ్వార్లు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది శియ్యాళి స్టేషనుకు ½ మైలు దూరములో యున్నది. 2 సత్రములు, భోజనశాలలు

వున్నవి, సన్నిధియందు ప్రసాదము లభించును. ఇచ్చట తిరు మంగయాళ్వారు సంబంధుని జయించి వైష్ణవ మత సిద్ధాంత మును స్థాపించి తాడాళిపెరుమాళ్లను మరల ప్రతిష్ఠగావించిరి. ఇచ్చట ప్రభలమైన శివాలయ మొకటియున్నది.



## 25. గూడలూరు

### (ఆడుదురై ప్పెరుమాళ్ కోయిల్)



ప్రభావము :—వైయంకాత్త ప్పెరుమాళ్లు, పద్మాసన వల్లి నాచ్చియారు, శుద్ధ సత్వవిమానము, చక్రతీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్నతిరుక్కోలము, నందక మహామునికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది కుంబకోణమునకు పడ మట 13 మైళ్ల దూరములోనున్న అయ్యంపేట్టై స్టేషనుకు ¾ మైలు దూరములోనున్న శివస్థలమయిన శక్రపల్లికి వుత్తర మున మంటిబాట మార్గముగా 2¼ మైలు దూరములో యు న్నది. తిరుక్కండియూరుకు వుత్తరమున రాజబాటమార్గ ముగా 1 మైలు దూరములో నున్న తిరువైయారునకు తూర్పున 7 మైళ్ల దూరములో ఈ దివ్యదేశమున్నది. బండ్లు చిక్కవు, సత్రములు, భోజనశాలలు లేవు, సన్నిధియందు ప్రసాదము లభ్యము.



# 26. తిరుకణ్ణంగుడి

ప్రభావము :—శ్యామలమేనిప్పెరుమాళ్లు, అరవింద వల్లి నాచ్చియారు, ఉత్పలవిమానము, రావణపుష్కరిణి, తూర్పుతిరుముఖమండలము, నిన్న తిరుక్కోలము, భృగుశైత్యానకు, గౌతమ మహర్షికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది తిరువారూరునకు తూర్పున 8 మైళ్ల దూరములోనున్న కీవళూర్ స్టేషనుకు తూర్పున మంటిబాట మార్గముగా 2 మైళ్ల దూరములోనున్నది. బండ్లు గలవు. సత్రములు భోజన శాలలు లేవు, సన్నిధియందు ముందుగా జెప్పియుంచినయెడల ప్రసాదములు దొరుకును.

ఇచ్చట రాత్రులయందు ముడుచుకొనని ఆకులుగల చింతమాను (ఉఱంగాప్పుళి) న్ను, చక్కగా పుష్పములు పుష్పించి కాయలు కాయని పొగడవృక్షము (కాయామగిళ్) న్ను, శ్రీరంగధాముని కైంకర్యమునకుగాను తిరుమంగయాళ్వారు నాగపట్టణమునుండి తెచ్చుచుండిన బౌద్ధ స్వర్ణ విగ్రహమును ఒక చేనిలో దాచియుంచగా చేని యజమానుడు నాఱునాటుటకు వచ్చినదే వానితో సాయంకాలము వరకు తీరని వివాదముంచుకొని నందువలన (తీరావఴక్కు) తీరని వ్యాజ్యము తిరుక్కణ్ణంగుడి యనిప్రసిద్ధి. తలారివానివలె తన్ను వెంబడించి వచ్చుచుండిన తిరుక్కణ్ణంగుడి పెరుమాళ్లె ప్రార్థన నంగీకరించి తిరుమంగయాళ్వారు తన హస్తము

తో విసిరివేసినరాయి పడినచోటు నందున్న మంచినీళ్ల కోనేరు వినహా వేరేచోటను శుద్ధజలములేదు. ఇందువలన వూరాకిణర్ అను పర్యాయనామము గలిగియున్నది. మాశి మాసములో మఖానక్షత్రము అవసానముగా 10 దినములు బ్రహ్మోత్సవము జరుగుచున్నది.

## 27. తిరుకణ్ణమంగై

ప్రభావము :—భక్తవత్సలపెరుమాళ్లు, అభిషేకవల్లి తాయారు, ఉత్పలవిమానము, దర్శన పుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, నిన్నతిరుక్కోలము, వరుణునకు, రోమమహర్షికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది తిరువారూర్ స్టేషనుకు వాయవ్యమున 1 మైలు దూరములో నున్న తిరువారూరుకు పడమట మంటిబాట మార్గముగా 4 మైళ్ల దూరములో నున్నది. తిరువారూరుకు పడమటనున్న కుళిక్కరై స్టేషనుకు వాయవ్యమున 2 మైళ్ల దూరములో నున్న అమ్మైయప్పన్ వూరునకు తూర్పున $1\frac{1}{2}$ మైలు దూరములో ఈ దివ్య దేశమున్నది. బండ్లువున్నవి, సత్రములు, భోజన శాలలు లేవు, సన్నిధియందు ప్రసాదములభ్యము.

బ్రహ్మోత్సవము :—చిత్రాపౌర్ణమి దినము తీర్థోత్సవము. స్వామి సన్నిధియందు తేనె గూడొకటి యున్నది. ఋషులు తేనెటీగల రూపములుదాల్చి పెరుమాళ్లను ఆరాధించి

నట్లు చెప్పెదరు. ఈ తేనెఘూటికిన్ని తిరువారాధన జరిపెదరు. ఈ పెరుమాళ్లకు ఆళ్వార్లు మంగళాశాసనము చేయుచుండు తరుణమందు తిన్ననూరు భక్తవత్సలస్వామి అచ్చటికి వేంచేసి సేవ సాయించగా ఆళ్వార్లు వారికివి ఇచ్చటనుండియే మంగళా శాసనము చేసిరి.

## 28. కపిస్థలము

ప్రభావము :—గజేంద్రవరదులు, రమామణి నాంచారు, పొత్తామరైయాళ్ నాంచారు, గఘనాకృతి విమానము, గజేంద్రపుష్కరిణి, కపిలతీర్థము, తూర్పు తిరుముఖమండలము, భుజంగశయనము, గజేంద్రునకు, ఆంజనేయునకు ప్రత్యక్షము, తిరుమళిశై యాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళా శాసనము.

మార్గవసతులు :—కుంబకోణం స్టేషనుకు పడమట 9 మైళ్ల దూరములోనున్న పాపనాశం స్టేషనుకు వుత్తర మున 2 మైళ్ల దూరములో నున్నది. మార్గమధ్యముననుండు కుడముర్టి, శిత్తారు, అరిశిలారు మొదలగు కావేరియొక్క శాఖానదులను వానకాలమునందు పడవలవల్ల దాటవచ్చును. అడుదుఱై ప్పెరుమాళ్ కోవిలకు తూర్పున మంటిబాట మార్గ ముగా 4 మైళ్ల దూరములో ఈ దివ్యక్షేత్ర మున్నది. దీనికి ఈశాన్యమున ఉమయాపురమునకు బోవు మంటిబాట మార్గ ముగా 4 మైళ్ల దూరములో తొండరడిప్పొడియాళ్వారు అవ

తారస్థలమయిన మండంగుడి యను గ్రామము యున్నది. బండ్లులేవు, సత్రములు వున్నవి. భోజన శాలలులేవు, సన్నిధి యందు ప్రసాదములు చిక్కును.

## 29. తిరువెళ్ళియంగుడి

ప్రభావము :—జయవల్లి రాములు, కోలవిల్లి రాములు, మరకతవల్లి తాయారు, పుష్కలా వర్తక విమానము, శుక్ర పుష్కరిణి, బ్రహ్మతీర్థము, తూర్పు తిరుముఖమండలము, భుజంగశయనము, శుక్రునకు, బ్రహ్మకు, పరాశరులకు, ఇంద్రునకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—తిరువిడమరుదూర్ స్టేషనుకు వుత్తరమున వేప్పత్తూరునకు పోవు రాజబాట మార్గముగా 5 మైళ్ల దూరములోనున్న ఆనైకుట్టియను వూరునకు తూర్పున 1 మైలు దూరములో ఈ దివ్యక్షేత్రమున్నది.

ఈ స్థలమునకు వుత్తరమున చేనిగట్టల మార్గముగా 1 మైలు దూరములో పెరియవాచ్చాన్‌పిళ్లై యవతార స్థలమయిన శంగనల్లూర్ అను గ్రామమున్నది. రైల్‌వేస్టేషను నుండి ఆనైకుట్టి గ్రామమువరకు బండ్లు చిక్కును, భోజన శాలలు, సత్రములులేవు. సన్నిధియందు ప్రసాదము చిక్కును. తిరువిడమరుదూరులో సత్రములు, భోజనశాలలు వున్నవి.

# 30. మణిమాడకోయిల్

## (తిరునాంగూర్)



ప్రభావము :—నందావిళక్కు పెరుమాళ్, నరనారాయణులు, పుణ్డరీకవల్లి తాయారు, ప్రణవ విమానము, ఇంద్ర పుష్కరిణి, రుద్రపుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, వీత్తిరుంద తిరుక్కోలము, ఏకాదశ రుద్రులకు, ఇంద్రునకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది వైదీశ్వరన్ కోయిల్ స్టేషనుకు ఈశాన్యమున 6 మైళ్ల దూరములో నున్నది, శియ్యాళి స్టేషనుకు 7 మైళ్ల దూరములో నున్నది. బండ్లువున్నవి, రామానుజకూట మున్నది, సత్రములు, భోజన శాలలు లేవు. సన్నిధిలో ముందుగా చెప్పియుంచినయెడల ప్రసాదము చిక్కును. 12 గరుడసేవలు జరుగు వుత్సవము రోజున కాఫీ క్లబ్బులును, యితర అంగళ్లును వుంచెదరు.

ఇయ్యాది తిరునాంగూరులో నున్న 6 తిరుపతులలో మొదటిది. ఈ స్థలము పూర్వము గొప్పపట్టణముగా యుండ వచ్చును. ఇప్పటికి చిన్న గ్రామముగా యున్నది. చిత్రి నెల యందు చిత్తానక్షత్రము అవసానముగా 9 దినములు బ్రహ్మోత్సవమును, ఆవణి నెలయందు అనూరాధా నక్షత్రము అవసానముగా 10 దినములు పవిత్రోత్సవమును జరిపెదరు.

తిరునాంగూరులో నున్న 6 తిరుపతులు యేవియనగా, మణిమాడక్కోయిల్, వైగుందవిణ్ణగరం, అరిమేయవిణ్ణగరం,

వణ్ పురుషోత్తమం, శెంబొన్ శెయ్‌కోయిల్, తిరుతెత్తి యం
బలం అను తిరుపతులు మొదలగునవి.

ప్రతి సంవత్సరమునందు తై యమావాస్య రోజున తిరు
నగరినుండి తిరుమంగయాళ్వారు తిరుప్పల్లకియందు వేంచేసి
తిరుక్కురైయలూరుకుపోయి పంచ నరసింహమూర్తులను
'వాడినేన్ వాడి' అను పాశురముతో ధ్యానించుకొని, పిమ్మట
మంగైమరం(తిరుమంగయాళ్వారు తదీయారాధనజరిపినచోటు)
చేరి 'అంజ్గణ్ జాలం' అను పాశురముతో శింగవేళ్ కుంద్రం
(అహోబిలం) మొదలగు వుత్తర దేశపు తిరుపతులను మంగళా
శాసనముచేసి, తిరుక్కావళం బాడి, తిరుమణికూడం, తిరు
ప్పార్తంపల్లి మొదలగు దివ్యక్షేత్రములకు వేంచేసి అచ్చట పెరు
మాళ్లను మంగళాశాసనముచేసి,మణికర్ణికయను తిరుక్కావేరి
యొక్క శాఖానదిగట్టున మంజక్కుళి మంరపమునకు వేంచేసె
దరు. అచ్చట తిరుమంజనం జరిగినపిదప శ్రీరంగేశుని 'మళింగు
నీణ్మాడి' యను పాశురముచేతను, తిరునఅయూరు నంబిగారిని
'కుల్తైయార్ న్ద' అను పాశురములచేతను మంగళాశాసనము
చేసి తిరునాంగూరునకు అస్తమయ సమయములో వేంచేసి,
ఇచ్చటనున్న 6 తిరుపతులను మంగళాశాసనముచేసి పిమ్మట
మణిమాడక్కోయిలులో వేంచేసియుండెదరు. ఈ క్షేత్రము
నకు మరనాడు 11 పెరుమాళ్లు మణిమాడక్కోయిలుకు వేం
చేసి ఆళ్వార్లకు సేవ సాయించి మంగళాశాసనము పొందెదరు.
అటుపిమ్మట పెరుమాళ్లందరికి తిరుమంజనములు జరుగును.

ఆ నాటిరాత్రి 11 పెరుమాళ్లున్ను గరుడ వాహనారూఢు లుగను ఆళ్వార్లు హంస వాహనమందు పెరుమాళ్లకు యెదురు సేవతో తిరువీధి వుత్సవము విభవముగా జరుగుచున్నది. మరుదినం వుదయం ఆయా పెరుమాళ్లు వారివారి సన్నిధులకు వేంచేసిన పిమ్మట, ఆళ్వార్లు మధ్యాహ్నం అచ్చటనుండి బైలు దేరి తిరుత్తేవనార్ తుగై మొదలగు దివ్యతిరుపతులను మంగళాశాసనముచేసి తిరువాలిని చేరగా అచ్చట వేంచేసియున్న నరసింహస్వామి గరుడారూఢులై సేవసాయించిన పిదప తిరుమంగైయాళ్వారు తిరునగరికి వేంచేసెదరు. ఈ 12 గరుడసేవల మహోత్సవమును వర్ణింప శక్యముగాదు.

## 31. తిరువైకుంద విణ్ణగరం

ప్రభావము :—వైకున్ద నాథప్పెరుమాళ్లు, తామరై క్కణ్ణుడైయపిరాన్, వైకుండవల్లి నాంచారు, అనంత సత్యా వర్తక విమానము, లక్ష్మీ పుష్కరిణి, ఉదంక పుష్కరిణి, విజర్య తూర్పు తిరుముఖమండలము, వీత్తిరుంద తిరుక్కోలము, ఉపరిచరవసురాజునకు, ఉదంగ మహర్షికి ప్రత్యక్షము, తిరుమంగ యాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది తిరునాంగూరులోయున్న 6 స్థలములలో నొక్కటి. మణిమాడ కోయిలుకు ¼ మైలు దూరములో ఈ క్షేత్రమున్నది.

# 32. అరిమేయ విణ్ణగరం

ప్రభావము :—కుడమాడు కూత్తప్పెరుమాళ్, అమృత ఘటవల్లి నాంచారు, ఉచ్చశృంగ విమానము, కోటి తీర్థము, అమృత తీర్థము, తూర్పు తిరుముఖమండలము, వీత్తిరుంద తిరుకోలము, ఉదంగ మహర్షికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము.

మార్గవసతులు :—ఈ దివ్యక్షేత్రము తిరునాంగూరుకు సంబంధించినట్టి 6 తిరుపతులలో చేరినది. మణిమాడ కోయిలుకు 200 గజముల దూరములో నున్నది.

# 33. తిరుత్తేవనార్ తుగై–కీళైచ్చాలై

ప్రభావము :—మాధవప్పెరుమాళ్లు, కడల్ మగళ్ నాంచారు, శోభన విమానము, శోభన పుష్కరిణి, దేవసభా పుష్కరిణి, పశ్చిమ తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, వశిష్ఠులకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము.

మార్గవసతులు :—దేవతలు గుమిగూడి మాధవుని వేంచేపు చేసిన స్థలముగా నుండుటవలన నీ క్షేత్రమునకు తిరుత్తేవనార్ తుగై యని పేరుగలిగినది. ఇయ్యది తిరునాంగూరుకు వుత్తరమున చేనుగట్టుమార్గముగా 1 మైలు దూరములో

నున్న, అణ్ణన్ కోవిలకు తూర్పున ½ మైలు దూరములో నున్న, శియ్యాళి స్టేషనుకు 4 మైళ్ల దూరములోనున్న ఈ దివ్య క్షేత్రమున్నది.

## 34. వణ్ పురుషోత్తమం

ప్రభావము:—పురుషోత్తమ పెరుమాళ్లు, పురుషోత్తమ నాయకి, సంజీవి గ్రహ విమానము, తిరుప్పార్ కడల్ తీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్నతిరుకోలము, ఉపమనువునకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది తిరునాంగూరులో యున్న 6 దివ్యదేశములలో నొక్కటి. పంగుని నెలలో చిత్తానక్షత్రము మొదలు 10 దినములు బ్రహ్మోత్సవము జరుగుచున్నది.

## 35. శెంబొన్ శెయ్ కోయిల్

ప్రభావము :—పేరరుళాలప్పెరుమాళ్, అల్లిమామలర్ నాంచారు, కనక విమానము, నిత్య పుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, నిన్నతిరుకోలము, రుద్రునికి ప్రత్యక్షము. తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము. ఈ క్షేత్రమున్న తిరునాంగూరులోనే యున్నది.

# 36. తిరు తెత్తియంబలం

ప్రభావము :—శెంగణ్ మాల్, అంబలప్పెరుమాళ్లు, శెంగమలవల్లి నాంచారు, వేద విమానము, సూర్య పుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, భుజంగశయనము, శెంగమలవల్లి నాంచారునకున్ను, అనంతునకున్ను ప్రత్యక్షము, తిరుమంగ యాళ్వార్ల మంగళాశాసనము. ఇదియును తిరునాంగూరులో నున్న ౧౧ దివ్యదేశములలో నొక్కటి.

# 37. తిరు మణిక్కూడం

ప్రభావము :—మణిక్కూడనాయకులు, తిరుమామగళ్ నాంచారు, కనక విమానము, చంద్ర పుష్కరిణి, తూర్పు తిరుముఖ మండలము, నిన్నతిరుక్కోలము, గరుత్మంతునికి, చంద్రునికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది తిరునాంగూరుకు తూర్పున 1 మైలు దూరములో నున్నది. కావళంబాడికి దక్షిణమున 3 మైళ్ల దూరములో ఈ దివ్యదేశము వున్నది.

# 38. కొవళ్ళంబాడి



ప్రభావము :—గోపాలకృష్ణప్పెరుమాళ్లు, మడవరల్ మంగై నాంచారు, శెంగలమలవల్లి నాంచారు. స్వయంభు విమానము, తడమలర్ పొయ్గై తీర్థము, తూర్పు తిరుముఖ మండలము, నిన్న తిరుక్కోలము, సుబ్రమణ్యునకు, మిత్రదేవునికి, రుద్రునికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యేది తిరునగరికి దక్షిణమున తిరువెళ్ గాడుకు పోవు మంటిబాట మార్గముగా $1\frac{1}{2}$ మైలు దూరములో నున్నది. ఏ సౌకర్యమున్ను లేదు. తిరుమణిక్కూడమునుండి తూర్పున రాజబాటమార్గముగా 3 మైళ్ల దూరములోనున్ను, చేనిగట్టుమార్గముగా $1\frac{1}{4}$ మైలు దూరములోనున్ను నున్నది. ఈ దివ్యదేశమునకు పడమట $\frac{1}{4}$ మైలు దూరములో తిరుమంగయాళ్వారు తదీయారాధనచేసిన చోటైన మాంగైమరమునందు వీరనరసింహస్వామి సన్నిధియును, తూర్పున 1 మైలు దూరములో తిరుక్కురైయలూరును వున్నవి.



# 39. తిరువెళ్ళక్కుళ్ళం—అణ్ణన్‌కోయిల్



ప్రభావము :—నారాయణన్, కణ్ణన్ పెరుమాళ్, పూవార్ తిరుమగళ్ నాంచారు, తత్త్వబోధక విమానము,

వెళ్లక్కుళతీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, ఇక్ష్వాకువంశపు రాజగు శ్వేతరాజునకు, రుద్రునకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది తిరుత్తేవనార్ తొగైకు వడమట ½ మైలు దూరములో నున్నది. ఈ క్షేత్రమునందున్న వెళ్లక్కుళ తీర్థమునందే తిరుమంగయాళ్వార్ల పత్నియైన కుముదవల్లి నాంచారు పుద్భవించిరి.



# 40. తిరుపార్త్తన్‌పళ్ళి



ప్రభావము :— తామరైయాళ్ కేళ్వప్పెరుమాళ్, తామరై నాయకి, నారాయణవిమానము, శంఖసరస్సు, పశ్చిమ తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, పార్థునకు, వరుణునకు, ఏకాదశ రుద్రులకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది తిరునాంగూరికి దక్షిణమున మంటిబాటమార్గముగా 2 మైళ్ల దూరములోనున్నది. ఏ విధమైన సౌకర్యములు లేవు.

చోళదేశపు తిరుపతులు 40 సమాప్తము.



# పాండ్యదేశపు తిరుపతులు 18

## 41. తిరుమాలిరుంశోలై

ప్రభావము :—అళగర్, మాలలంకారర్, సుందర వల్లి నాంచారు, సోమసుందర విమానము, నూపురనది తీర్థము (శిలంబాఱు), తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోల ము, వృషభగిరి, గంధ వృక్షము, మలయ ధ్వజ పాండ్యు నకును, ధర్మదేవతకును ప్రత్యక్షము. పూదత్తాళ్వారు, పేయా ళ్వారు, నమ్మాళ్వారు, ఆండాళు, తిరుమంగయాళ్వారు మంగ ళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది మధురకు ఈశాన్యమున రాజబాటమార్గముగా 12 మైళ్ల దూరములో కొండ అడి వారమునం దున్నది. నూపురనది (నూపురగంగ) సన్నిధికి వుత్తరమున కొండమీదుగా 3 మైళ్ల దూరములో యున్నది. ఈ దివ్యదేశమునకు దక్షిణమున 10 మైళ్ల దూరములో తిరు మోగూర్ అను దివ్యదేశము యున్నది. సన్నిధిచుట్టు అరణ్యముగా నుండుటచేత సన్నిధియందే బసచేయవలెను. సన్నిధిలో ప్రసాదములు చిక్కును, మధురనుండి ఈ సన్నిధికి మోటారుబస్సుల రాకపోకలు యున్నవి. సత్రము లున్నవి.

సన్నిధికి వుత్తరమున 1 ఫర్లాంగుదూరములోనున్న నూపుర నది తీర్థమునుండి గొట్టములగుండా నీరు వచ్చుచున్నవి. ఎలక్ట్రిక్ దీపములు వెలుగుచుండును. ఈ యళగర్ సన్నిధిని అళగర్ కోటయని చెప్పబడును. కోటగోడలు చాలాభాగము శిథిలముగా నున్నది. పాండ్యరాజులును, మధురరాజగు తిరుమలనాయకులును ఈ సన్నిధికి అనేక కైంకర్యములు చేసియున్నారు. ఈ క్షేత్రము దక్షిణ తిరుపతియని ప్రసిద్ధము. సదాకాలము జనులు ప్రార్థనలు చెల్లించుటకు వచ్చుచునే యుందురు. ఇయ్యది ఆరణ్యముగా యుండుటచేత కొండ చరియలలో పులులు మొదలగు దుష్టమృగములు మిక్కుటముగా నున్నవి. ఇచ్చట మర్కటములు మెండుగా నున్నవి.

ఉత్సవ వైభవములు :—ఆడిమాసమునందు పౌర్ణమి అవసానముగా 10 దినములు బ్రహ్మోత్సవము జరుగుచున్నది. చిత్రా పౌర్ణమినాడు మధురలోయుందు వైఘునదికి వేంచేయు ఏటివుత్సవము జగత్ప్రసిద్ధము. నమ్మాళ్వారుల పాశురములలోను, కూరత్తాళ్వారుల స్తోత్రమునందును అళగర్ దివ్యమంగళ విగ్రహముయొక్క వైభవములను విశేషించి చెప్పబడి యున్నవి. పెరుమాళ్లను నేరులో సేవించువారికి వారి దివ్యమంగళ తేజస్సు విరాజిల్లును.

ఈ సన్నిధియందు గోపురద్వారమునందున్న 18-వ పడిగట్టు కరుప్పణ్ణన్ సన్నిధికి కావలివారుగా నున్నారు. మధురాపురి వాసులు నేరస్థులును ఈ 18-వ పడిగట్టువద్ద

ప్రమాణము చేయమనుదురు. నేరస్థుడు అప్రమాణము చేసిన యెడల వానికి అనేక విపత్తులు తటస్థించును. ఈ కరుప్పణ్ణునకు మేకలు, కోళ్లు బలియిచ్చుచున్నారు. స్వామి వుత్సవకాలమునందు చక్రత్తాళ్వారులుమాత్రమే గోపుర ద్వారముగుండా వేంచేయుదురు. పెరుమాళ్లు ఈ గోపురద్వారమునకు ప్రక్కగానున్న ద్వారమార్గముగా వేంచేయుచున్నారు. పెరుమాళ్లకు కళ్లళగర్ యను తిరునామము గలదు. చిత్రాపౌర్ణమి నాడు యేటివుత్సవమునకు వైఘునదికి వేంచేసిన కారణమువల్ల నాచ్చియారుకు అలుక బొడమినందున పెరుమాళ్లు ఆ దినము మొదలు ఆది బ్రహ్మోత్సవ శాత్తుమురదినమువరకు ఆస్థానమునకు వేంచేయక సన్నిధి ప్రాకారమున నొక మూలయందున్న మంటపమునందు వేంచేసియుండి తిరువారాధనము జరిపించుకొనెదరు. ఇచ్చట పెరుమాళ్లు ఆరగించుదోసె చాలా పెద్దది. ఇటువంటిది వేరే దివ్యదేశమునందును చేయుట లేదు. 1 దోసె వెల రూపాయ (1-4-0) ఇచ్చట నుండు పుష్కరిణికి నరవణ పొయ్గై యని పేరు.

## 42. తిరుకూడల్ – దక్షిణమధుర

ప్రభావము :— కూడలళగర్, వకుళవల్లి నాంచారు, మరకతవల్లి నాంచారు, వీరగుణవల్లి నాంచారు, మధురైవల్లి నాంచారు, అష్టాంగవిమానము, హేమపుష్కరిణి, చక్రతీర్థము,

తూర్పు తిరుముఖమండలము, వీ త్తిరుంద తిరుకోలము, శౌనకాదులకు, భృగుమహర్షికి, పెరియాళ్వారుకు ప్రత్యక్షము. తిరుమళిశై యాళ్వారు, పెరియాళ్వారు, తిరుమంగయాళ్వారు, ఆండాళ్ మంగళాశాసనము.

మార్గవసతులు :—మధురస్టేషనుకు తూర్పున 1 మైలు దూరములో స్వామిసన్నిధి యున్నది. ఇయ్యది పెద్దపట్టణము గాన సత్రములు, భోజనశాలలు, కాఫీక్లబ్బులు విశేషముగా నున్నవి. 1 రామానుజకూటము వున్నది. ఇచ్చటికి ఈశాన్యమున 12 మైళ్లు దూరములో అళగర్ సన్నిధియును, తూర్పున 7 మైళ్ల దూరములో తిరుమోగూరును వున్నవి. సన్నిధియందు దేశాంతరులకు ప్రసాదములు యివ్వబడును.

ఉత్సవవైభవములు :—బ్రహ్మోత్సవము-వైయాశి నెల అనూరాధ నక్షత్రముతో కూడిన పౌర్ణమినాడు తీర్థోత్సవము. మాశి నెల మఖానక్షత్రము దినము సమాప్తిగా 10 రోజులు తెప్పోత్సవము జరుగుచున్నది. ఈ సన్నిధికి మూడు పెద్దప్రాకారము లున్నవి. రెండవ ప్రాకారమునందు నవగ్రహములు ప్రతిష్ఠ గావింపబడియున్నవి. పెరుమాళ్ల సన్నిధిలో నవగ్రహము లుండుటలేదు, చూచువారికి విస్మయము గల్గును. ఈ సన్నిధిలో అష్టాంగ విమానము మిగుల పెద్దది. ఇంతటి గొప్పవిమానము వేరు యే దివ్యదేశ మందును లేదు. మూడవ ప్రాకారమునందు తాయార్లసన్నిధి

ఆండాళ్ సన్నిధి, మణవాళమామునుల సన్నధులు యున్నవి. విమానముయొక్క అంతస్తునందు శయన తిరుక్కోలముతో శ్రీ రంగనాథులున్ను, దానికి పై యంతస్తులో నిన్న తిరుక్కోలముగా సూర్యనారాయణులును, వేంచేసియున్నారు. వీట్లను చూచుటకు మెట్లు అందముగా అమర్చబడి యున్నవి. సన్నిధిలో ఎలక్ట్రిక్ దీపములు వెలుగుచున్నవి. ఈ మధురలో నున్న మీనాక్షిగుడి చాలాపెద్దది. తిరుమలనాయకుల మహలున్ను, తెప్పగుంటయున్ను చూడతగిన వినోదములు.

ఈ నగరము పూర్వకాలమున దక్షిణాపథమున ప్రసిద్ధి జెందినది, కొన్ని శతాబ్దములకు ముందు పాండ్యరాజ్యమునకు ప్రధాన నగరముగా నుండెను. ఇయ్యది వైఘనదియొక్క దక్షిణ తీరమునం దున్నది.



# 43. తిరుమోగూర్



ప్రభావము :—కాలమేఘప్పెరుమాళ్, మోగూర్ వల్లి నాచ్చియారు, మేఘవల్లి నాచ్చియారు, కేతకవిమానము, క్షీరాబ్ధి పుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుక్కోలము, అజరుద్రులకున్ను, దేవేంద్రునికిన్ని ప్రత్యక్షము, నమ్మాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది మధురకు ఈశాన్యమున రాజబాటమార్గముగా 7 మైళ్ల దూరములోనున్ను, అళగర్ సన్నిధికి దక్షిణమున 10 మైళ్ల దూరములోనున్ను వున్నది. బండ్లు వున్నవి. మధురనుండి అళగర్ సన్నిధికిన్ని, తిరుమోగూరునకును, మేలూరకును మోటరుబస్సుల రాకపోకలు గలవు. సత్రములు, భోజనశాలలు లేవు, సన్నిధియందు ప్రసాదములు చిక్కును. అమృతమును పంచిపెట్టు నిమిత్తము మోహనావతార మెత్తిన పెరుమాళ్లు దేవతల ప్రార్థన నంగీకరించి కాలమేఘ తిరువవతారముతో యిచ్చట వేంచేసియుండుటవల్ల ఈ దివ్యదేశమునకు (మోహనపురము) మోగూర్ అని పేరు వచ్చినది. వైయాశి నెల విశాఖానక్షత్రము రోజున తీర్థోత్సవము జరుగును.

## 44. తిరుకోట్టియూర్ – గోష్ఠీపురం

ప్రభావము :—సౌమ్య నారాయణప్పెరుమాళ్లు, తిరుమామగళ్ నాంచారు, అష్టాంగవిమానము, దేవపుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, నిను ఇరుందు నడంత కూత్తాడిన తిరుకోలము, కదంబ మహర్షికిని, ఇంద్రునికిని ప్రత్యక్షము, పూదత్తాళ్వారు, పేయాళ్వారు, తిరుమళిశై యాళ్వారు, పెరియాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇత్యాది తిరుచ్చినాపల్లి-మానా మధురైలైను మార్గములోనున్న తిరుమెయ్యాం స్టేషనుకు దక్షిణమున రాజబాటమార్గముగా 15 మైళ్ల దూరములో నున్న తిరుప్పుత్తూరు (శివస్థలము) కు దక్షిణమునకు 6 మైళ్ల దూరములో నున్నది.

మధురకు తూర్పున 7 మైళ్ల దూరములోనున్న తిరుమోగూరునుండి రాజబాటమార్గముగా 11 మైళ్ల దూరములోనున్న మేలూరునకు ఈశాన్యమున 18 మైళ్ల దూరములో నున్న తిరుప్పత్తూరుచుం జేరి, అచ్చటనుండి దక్షిణమున 6 మైళ్ల దూరము పోయిన ఈ దివ్యదేశమును జేరవచ్చును. మోటారుబండ్లు గుఱ్ఱపు బండ్లమీఁదుగా పోవచ్చును. మధురకు తూర్పున 30 మైళ్ల దూరమున నున్న మానామధురై స్టేషనుకు వుత్తరమున రాజబాటమార్గముగా 11 మైళ్ల దూరములో నున్న శివగంగకు వుత్తరమున 16 మైళ్ల దూరములో నీ క్షేత్ర మున్నది. మానామధుర స్టేషనునుండి శివగంగకు గుఱ్ఱపు బండ్లమీఁదుగను, శివగంగనుండి ఈ తిరుక్కోట్టియూరునకు రెండెద్దుల బండ్లమీఁదుగను ప్రయాణము చేయవలయును. ఈ దివ్యదేశమున సత్రములు భోజనశాలలు వున్నవి. సన్నిధియందును ప్రసాదము చిక్కును. తిరుప్పత్తూరులోను, మానామధురలోను, శివగంగలోను సత్రములు, భోజనశాలలు వున్నవి.

ఉత్సవ వైభవములు :—చిత్రి మాసమునందు చిత్తా నక్షత్రం అవసానముగా 10 రోజులు బ్రహ్మోత్సవము జరు

గుచున్నది. హిరణ్యుని బాధలకు ఓర్వజాలక దేవతలు కదం బమునియొక్క మహిమచేత ఆ రక్కసుడు వచ్చుటకు సాధ్యముకాని స్థలమయిన ఈ క్షేత్రమునందు (గోష్టి) గుమిగూడి ఆలోచించిన చోటయినందున ఈ క్షేత్రమునకు గోష్ఠీపురమని పేరు గలిగినది. ఇచ్చట వేంచేసియున్న అర్చావిగ్రహము (వెండితో) రజితముతో జేయబడినది. ఇచ్చట యున్న అష్టాంగవిమానము ముఖ్యముగా శేవింపదగియున్నది. తిరుక్కోట్టియూర్ నంబిగారు అవతార స్థలమిదియే. ఇచ్చటికి ఉడయవరులు 18 మారులు వేంచేసి తిరుమంత్రార్థమును తిరుక్కోట్టియూరు నంబిగారిచే ఉపదేశముబొంది సకల చేతనులను వుజ్జీవింపచేయవలయునను వుద్దేశ్యముగలిగి పరమకృపతో దామోదరగోపురము (అష్టాంగ విమానము) పై నెక్కి తిరుమంత్రమును వెదచల్లిరి. నంబిగారికిన్ని, ఉడయవరులకున్ను ప్రత్యేకముగా సన్నధులు వున్నవి.



# 45. తిరుమెయ్యం



ప్రభావము :—సత్యగిరినాథులు, ఉయ్యావందాళ్ తాయారు, సత్యగిరి విమానము, సత్యగిరి, సత్యతీర్థము, కదంబపుష్కరిణి, పనసవృక్షము, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుక్కోలము, సత్యదేవతకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము.

మార్గవసతులు :—తిరుచ్చినాపల్లి - మానా మదురై రైలుమార్గములో నున్న తిరుమెయ్యం స్టేషనుకు ½ మైలు దూరమున సన్నిధియున్నది. పుదుకోట్టకు దక్షిణమున 12 మైళ్ల దూరములో ఈ దివ్యదేశము యున్నది. ఇచ్చట నాట్టు కోట్టవారి సత్ర మొకటివున్నది. కాఫీక్లబ్బులు, భోజనశాలలు వున్నవి. సన్నిధియందు ప్రసాదము చిక్కును. ఈ దివ్యదేశ మునకు దక్షిణమున 15 మైళ్ల దూరములో తిరుప్పత్తూరును, దీనికి దక్షిణమున 6 మైళ్ల దూరములో తిరుక్కోట్టియూరును యున్నది. వైయ్యాశి నెలయందు ధనిష్ఠా నక్షత్రము రోజు అవ సానముగా 10 రోజులు బ్రహ్మోత్సవము జరుగును. ఇచ్చట తిరుమెయ్యపురాజయిన ఊమైయ్యన్ దాగియుండిన స్థల మున్ను చూడతగినది. దీనిని సత్యక్షేత్రమని చెప్పుదురు. సత్రక్షేత్రమునకు ద్రావిడపదము తిరుమెయ్యం. ఇయ్యది అందమైన నగరమైనందున సర్వ సౌకర్యములున్ను గలవు. స్వామిసన్నిధికి ప్రక్కన సత్యగిరీశ్వరునిగుడి (ప్రబలమయిన శివాలయము) యున్నది.



# 46. తిరుప్పుల్లాణి – దర్భశయనము



ప్రభావము :—కల్యాణ జగన్నాథుడు, దైవశిలై యర్, కల్యాణవల్లి నాచ్చారు, కల్యాణవిమానము, హేమ తీర్థము, చక్రతీర్థము, అశ్వత్థతీర్థము, తూర్పు తిరుముఖమండ లము, నిన్న తిరుకోలము, పుల్లారణ్యక్షేత్రము, దర్భ

శయనము, పుల్లారణ్య మహర్షికి, అశ్వత్థ నారాయణునకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము, శ్రీరాములు సముద్రరాజునకు వరమొసగిన స్థలము.

మార్గవసతులు :—ఇయ్యది రామనాథపురం స్టేషనుకు దక్షిణమున మంటిబాటమార్గముగా 6 మైళ్ల దూరములో నున్నది. ఇచ్చటికి దక్షిణమున 3 మైళ్ల దూరములో ఆదిశేతు సముద్రస్నాన ఘట్టము వున్నది. సేతు స్నానము చేసినవారు సర్వపాప విముక్తు లగుదురు. బండ్లు గలవు, సత్రము వున్నది.

సన్నిధిలోనున్న గొప్ప ప్రభావముగల అశ్వత్థవృక్షముక్రింద నాగప్రతిష్ఠ చేసినవారికి అవశ్యము సంతానప్రాప్తి గలుగును. ఇచ్చటనున్న నాగప్రతిష్టవలె యెచ్చటలేదు. పెరుమాళ్లు ఆరగించు పాయసము యాత్ర వాసులందరు తప్పక స్వీకరించవలయును. ఈ సన్నిధియందు దేవగణములు సేవించి నిలిచియుండ పత్నీసహితముగా వరుణదేవుడు (సముద్ర రాజు) ను, విభీషణుడును శరణాగతి జేసి నిలుచుచుండ, దర్భ మీదుగా శయనించి శ్రీరామమూర్తి సేవ సాయించుచున్నారు.



## 47. తిరుత్తంగాల్ - తిరుత్తణ్గాలూర్



ప్రభావము :—అప్పన్, తణ్గాలప్పన్, అన్ననాయకి, అనంతనాయకి, నాచ్చియార్లు నలుగురు, దేవచంద్రవిమానము, పాపవినాశ తీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్న

తిరుక్కోలము, శల్యపాండునకు, శ్రీ వల్లభునకు, పులికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—శివకాశి స్టేషనుకు వుత్తరముగ రాజబాటమార్గముగా 2 మైళ్ల దూరములో నున్నది. సన్నిధియందు ప్రసాదములు చిక్కును. బండ్లు వున్నవి, రామానుజకూట మున్నది. సత్రములు కాఫీక్లబ్బులు వున్నవి, భోజనశాలలు లేవు. శివకాశి యందు సర్వ సౌకర్యములు వున్నవి. శివకాశికి పడమట 13 మైళ్ల దూరములో శ్రీవిల్లిపుత్తూర్ వున్నది.

శ్రీకృష్ణమూర్తి బాణాసురుని జయించి అనిరుద్ధునకును ఉషకును పరిణయము గావించిన చోటిదియే. ఇచ్చట జాంబవతి నాంచారు నిన్న తిరుక్కోలముతో వేంచేసియుండుటయు, ఇచ్చటనున్న పెరియతిరువడి (గరుడాళ్వారు) అంజలిహస్తులై, శర్పమును, అమృత కలశముతో కూడుకొనియున్న రెండు హస్తములతో నుండుట చూచువారికి విస్మయము గలుగును.

## 48. శ్రీవిల్లిపుత్తూరు

ప్రభావము :—వటపత్రశాయి, రంగమన్నారు, ఆండాళు, గరుత్మంతులు, గోదాదేవి నాచ్చియారు, సంశన విమానము, తిరుముక్కుళ తీర్థము, తూర్పు తిరుముఖమండలము,

వటపత్రశయనము, నిన్న తిరుకోలము, మండూక మహర్షికిని, పెరియాళ్వారులకు ప్రత్యక్షము. పెరియాళ్వారు, ఆండాళు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది విరుదునగర్ - తెన్‌కాసి లైనులోనున్న శ్రీవిల్లిపుత్తూరు స్టేషనుకు వాయవ్యమున రాజబాటమార్గముగా 2 మైళ్ల దూరములో నున్నది. బండ్లు వున్నవి, సత్రములు, భోజనశాలలు, కాఫీక్లబ్బులు వున్నవి. రామానుజ కూటము లున్నవి. సన్నిధియందు ప్రసాదము చిక్కును. ఈ దివ్యదేశమునకు వుత్తరమున 11 మైళ్ల దూరములో కాట్టళగర్ సన్నిధియును, ఉత్తరమున 3 మైళ్ల దూరములో శ్రీనివాసుని సన్నిధి (తిరునెల్వేలి జిల్లాకు తిరువేంగడముడైయాన్ తిరుపతివలె యున్నది. సదా జనులు ప్రార్థనలు చెల్లించుటకు వచ్చుచుండెదరు) యును వున్నవి. శ్రీవిల్లిపుత్తూరునకు తూర్పున 13 మైళ్ల దూరములోనున్న శివకాశికి వుత్తరమున 2 మైళ్ల తిరుతజ్గాల్ అను క్షేత్రమున్నది.

ఉత్సవవైభవములు:—ఆని మాసమునందు స్వాతీనక్షత్రము రోజు సమాప్తిగా పెరియాళ్వార్లకు 10 దినములును, ఆడిమాసమునందు పుబ్బానక్షత్రము సమాప్తిగా శ్రీ ఆండాళుకు 9 దినముల వుత్సవమును, పెరటాశినెలయందు శ్రవణ నక్షత్రము రోజు అవసానముగా వటపత్రశాయికి 10 దినములును, మార్గళిమాసమందు 22-వ తేది మొదలు మాసాంత్యం

వరకు ఆండాళుకు నీరాటం వుత్సవమును, పంగునినెలలో ఉత్త
రా నక్షత్రము రోజు శ్రీయాండాళుకు తిరుకల్యాణం మొద
లుగా గల మహోత్సవములు జరిపెదరు. ఆడి వుత్సవములో
ౕ-వ నాడు వుదయమున రంగమన్నారు, వటపత్రశాయి, తిరు
త్తణ్గాలప్పన్,శ్రీనివాసులు,కాట్టళగర్ మొదలగు అయిదుపెరు
మాళ్లు వేంచేయునప్పుడు పెరియాళ్వారు యెదుర్కొని మంగ
ళాశాసనము చేయు మహోత్సవమును, నాటిరాత్రి ఆండాళు
హంసవాహనముతోను పై నుదహరించిన అయిదుపెరుమాళ్లు
ను గరుడవాహనములో తిరువీధులలో వేంచేయు మహో
త్సవము కనుల కండువుగా నుండును, చూచి సేవించువారికి
ఆహ్లాదమును గలిగించును. శ్రీయాండాళ్ ప్రార్థనవలన రంగ
మన్నారు రాజగోపాల రూపముతో వేంచేపు చేయించుకొని
వచ్చిన పెరియ తిరువడి, పెరుమాళ్లకు సమీపమున యేకాస
నమునందు వేంచేసియున్నారు. పెరియాళ్వారుకు అను దిన
ము జరుగు తిరుమంజనమును, పిదప జరుగు మంగళాశాసన
మున్ను ముఖ్యముగా సేవింపతగినవి. విల్లియను చెంచురాజుచే
కట్టింపబడి నందువలన ఈ దివ్యదేశంబునకు శ్రీవిల్లి పుత్తూరని
నామముగలిగెను.

# 49. తిరుక్కురుగూర్–ఆళ్వార్ తిరునగరి

ప్రభావము :—ఆదినాథ ప్పెరుమాళ్లు, పొలిన్దునిన్ద్ర పిరాన్, ఆదినాథవల్లితాయార్, గోవిందవిమానము, తామ్రపర్ణినది, బ్రహ్మతీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, బ్రహ్మకు, నమ్మాళ్వారులకు, మధురకవి యాళ్వార్లకు ప్రత్యక్షము, నమ్మాళ్వార్ల మంగళాశాసనము.

మార్గవసతులు :—శియ్యాది ఆళ్వారు తిరునగరి స్టేషనుకు పడమట రాజబాట మార్గముగా 1 మైలు దూరములో నున్నది. బండ్లుగలవు, సత్రములు, భోజనశాలలు, కాఫీక్లబ్బులు వున్నవి. సన్నిధియందు ప్రసాదము లభ్యమగును, ఈ దివ్యదేశమునకు పడమట 3 మైళ్ల దూరములో తామ్రపర్ణి ఉత్తరతీరమున శ్రీ వైకుంఠమును, ఇచ్చటికి తూర్పున వరగుణమంగై, తిరుప్పుళింగుడి, తిరుక్కుళన్దై మొదలగు క్షేత్రము లున్నవి. ఈ దివ్యదేశమునకు చుట్టునవున్న నవ తిరుపతులను సులభముగా సేవింపవచ్చును. ఈ నవతిరుపతులను సేవించుటకు యిచ్చటనే బండ్లను యమర్చుకొని పోవలయును. ఈస్థలమునకు తూర్పున 16 మైళ్ల దూరములో సముద్రతీరమున ప్రసిద్ధిజెందిన తిరుచ్చెందూరను సుబ్రమణ్యస్థలము వున్నది.

ఉత్సవవైభవములు :—చిత్రినెలయందు ఉత్తరానక్షత్రము రోజు అవసానముగా 10 దినములు పెరుమాళ్లకు

బ్రహ్మోత్సవమును, వైయాశి నెల విశాఖానక్షత్రము రోజున సమాప్తిగా 10 రోజులు వుత్సవము నమ్మాళ్వారుకు అతివైభవముగా జరుగును. మార్గళి మాసములో ఈ సన్నిధియందు అధ్యయన వుత్సవము మిగుల విమర్శగా జరుగును. ఆళ్వారుల వుత్సవమునందు అయిదవదినము వుదయమున నవతిరుపతుల పెరుమాళ్లు ఇచ్చటికి వేంచేసి తిరుమంజనము తిరువారాధనము జరిగినపిదప నాటిరాత్రి 11 ఘంటలకు నవతిరుపతుల పెరుమాళ్లు గరుడారూఢులై వేంచేయు తరుణమందు, ఆళ్వార్లు హంస వాహనారూఢులై ప్రత్యేక ప్రత్యేకముగా ఒక్కొకస్వామికి మంగళాశాసనము చేసెదరు. పిదప ఆళ్వార్లు ముందుగా పెరుమాళ్లకు యెదురుసేవతో మిగుల వైభవముతో తిరువీధులయందు వేంచేసెదరు. ఈ మహోత్సవమును సేవించువారి నేత్రములు ఆనందముచేత పూరితమై పోవును. యెనిమిదవ వుత్సవదినము ఆళ్వారు కణ్ణిన్ తిరుక్కోలముతో అప్పన్ సన్నిధికి వేంచేసి పాలముదు ఆరగించునట్టి శేవ సేవించుటకు అత్యద్భుతముగా నుండును. నమ్మాళ్వారులచే మంగళాశాసనము పొందిన 36 దివ్యదేశపు పెరుమాళ్లు, నమ్మాళ్వారుల యవతారమునకు పూర్వమే ఆదిశేషాంశముగా వుద్భవించియున్న తిరుప్పుళియాళ్వార్ (చింతచెట్టు) క్రింద చిత్రరూపములతో వేంచేసియున్నారు. ప్రతిదినమును నమ్మాళ్వారు తిరుమంజన మంటపమునకు వేంచేసెదరు, తిరుమంజనము జరిగినపిదప ద్రవిడ ప్రబంధసేవ జరుగును. పిదప తైలక్కాపు మొదలగునవి వినియోగమగును. నమ్మాళ్వారులు అవతరించిన స్థలమైన అప్పన్ కోయిల్ ఈ దివ్యదేశమునకు 1 మైలు దూరములో

నున్నది. ఈ సన్నిధియందున్న పెద్ద ప్రాకారముయొక్క ఎడమ పార్శ్వమున (గరుడర్ సన్నిధి) గరుడాళ్వారుల సన్నిధి యున్నది. వీరికి నిత్య తిరువారాధనమును, ఆడిమాసము నందు స్వాతీనక్షత్రము రోజున ప్రబలవుత్సవము జరుగును.



# 50. తిరుత్తొలైవిల్లి మఙ్గలం
## (రెట్టై తిరుపతి)



ప్రభావము :—దేవపిరాన్, అరవిందలోచనుడు, కరున్తడఙ్కణ్ణి నాచ్చియార్, కుముదవిమానము, తామ్రపర్ణినది, వరుణతీర్థము. తూర్పు తిరుముఖమండలము, నిన్నతిరుకోలము, వీత్తిరుంద తిరుకోలము, ఇంద్రునకు, వాయువునకు, వరుణునకు ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది ఆళ్వారు తిరునగరి స్టేషనుకు తూర్పున తామ్రపర్ణినది వుత్తరతీరమునందు 2 మైళ్ల దూరములో నున్నది. దీనికి పడమట నమ్మాళ్వారు అవతార స్థలమైన అప్పన్ సన్నిధియున్నది. ఇచ్చటికి ఈశాన్యమున 3 మైళ్ల దూరములో తిరుకుళన్దైయను దివ్యదేశమున్నది. బండ్లు గలవు. భోజనశాలలు లేవు, సన్నిధియందు ప్రసాదము దొరకును, సౌకర్యము లేవిన్ని లేవు. జంటతిరుపతులు యుండుట వలన రెట్టైతిరుపతియని పేరుగల్గెను.



# 51. శ్రీ వైకుంఠం

ప్రభావము :—కళ్లభిరాళ్, వైకుంఠనాథుడు, వైకున్ద వల్లి నాచ్చియార్, చంద్రవిమానము, తామ్రపర్ణినది, భృగు తీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్నతిరుకోలము, ఇంద్రునికి, భృగుచక్రవర్తికి ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది తిరునల్వేలి - తిరుచ్చెందూరు రైనులోనున్న శ్రీ వైకుంఠం స్టేషనుకు వుత్తరమున ¾ మైలు దూరమున తామ్రపర్ణినదీ తీరమున నున్నది. దీనికి తూర్పున 3 మైళ్ల దూరములో తామ్రపర్ణినదియొక్క దక్షిణ తీరమున ఆళ్వారు తిరునగరియును, తూర్పున 1 మైలు దూరమున వరగుణమంగైయును, తిరుప్పుళిఙ్గుడియును యున్నవి. బండ్లు వున్నవి, సత్రములు భోజనశాలలు, కాపీక్లబ్బులు వున్నవి.

# 52. వరగుణమఙ్గై

ప్రభావము :—విజయాసనుడు, వరగుణవల్లి నాచ్చియార్, విజయకోటి విమానము, దేవ పుష్కరిణి, అగ్నితీర్థము, తూర్పు తిరుముఖమండలము, వీత్తిరున్ద తిరుకోలము, అగ్నికి ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగాళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది శ్రీ వైకుంఠమునకు తూర్పున రాజబాటమార్గముగా 1 మైలు దూరములో వున్నది, బండ్లుమాత్రముగలవు, తదితర సౌకర్యములు యుండవు. ఇచ్చట సన్నిధి తిరువారాధన కాలమునందు పోయి సేవించవలయును. తక్కిన కాలమందు సన్నిధితలుపులు మూయబడియుండును.



# 53. తిరుప్పుళిఙ్గుడి



ప్రభావము :—కాయ్చిన వేన్దప్పెరుమాళ్, మలర్ మగళ్ నాచ్చియార్, పుళిఙ్గుడివల్లి నాచ్చియార్, వేదసార విమానము, వరుణతీర్థము, నిరుతితీర్థము, తూర్పు తిరుముఖ మండలము, భుజఙ్గశయనము, నైరుతునకు, వరుణునకు, ధర్మ రాజునకు ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది వరగుణమఙ్గకు తూర్పున 1 మైలు దూరములోనున్న, శ్రీ వైకుంఠం స్టేషనుకు 2 మైళ్ల దూరములోను నున్నది. బండ్లుతప్ప వేరే యితర సౌకర్యములు లేవు. ఈ సన్నధి పెరుమాళ్లను లోపలికిపోయి సేవించుటకు బ్రాహ్మణులుతప్ప తదితరులు విమానమునకు బైటనుండి చిన్నద్వారము మూలముగా సేవింపవలయును.



# 54. తిరుక్కుళన్దై - తెఞ్కుళన్దై

(పెరుఙ్గుళం)

ప్రభావము :—మాయకూత్తప్పెరుమాళ్, కుళన్దై వల్లి నాచ్చియార్, ఆనన్దనిలయ విమానము, పెరుఙ్కుళ తీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుక్కోలము, బృహస్పతికి ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—శ్రీ వైకుంఠం స్టేషనుకు వుత్తరమున రాజబాటమార్గముగా 7 మైళ్ల దూరములో వున్నది. సన్నిధిలో ప్రసాదము లభ్యమగును, బండ్లు వున్నవి, సత్రములు భోజనశాలలు లేవు.

# 55. తిరుప్పేరై

ప్రభావము :—మకరనెడుఙ్గుళైకాత్త ప్పెరుమాళ్, నిగరిల్ ముగిల్వణ్ణన్, కుళైక్కాదువల్లి నాచ్చియార్, భద్ర విమానము, శుక్రపుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, వీత్తిరున్ద తిరుక్కోలము, శుక్రునకు, బ్రహ్మకు, ఈశాన్యరుద్రునకు ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది ఆళ్వార్ తిరునగరి స్టేషనుకు ఆగ్నేయమున రాజబాటమార్గముగా 3 మైళ్ల దూరములోనున్న రెట్టై త్తిరుపతి (తొలైవిల్లి మజ్గలం)కి దక్షిణమున 1 మైలు దూరములో యున్నది. ఈ దివ్యదేశమునకు 2 మైళ్ల దూరములో తిరుక్కుళంతై దివ్యదేశమున్నది. పంగునిమాసమున ఉత్తరానక్షత్రము జరుగునాడు మొదలుకొని 10 దినములు బ్రహ్మోత్సవము.

# 56. తిరుక్కోళూర్

ప్రభావము :—వైత్తమానిధి పెరుమాళ్ (నిక్షేపవిత్తుడు) కోళూరువల్లినాచ్చియార్, శ్రీకరవిమానము, కుబేరతీర్థము, తామ్రపర్ణినది, తూరు తిరుముఖమండలము, భుజంగశయనము, కుబేరునకు, మధుకవియాళ్వారుకు ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది ఆళ్వార్ తిరునగరి స్టేషనుకు 1 మైలు దూరములోనున్న తిరుప్పేరై యను దివ్యదేశమునకు పడమట 2 మైళ్లలోను, ఆళ్వారు సన్నిధికి తూర్పు 2 మైళ్ల దూరములో యున్నది. నవ నిధులు యిచ్చుట దాగియుండునట్లు అధర్మము కుబేరునకు శాపము చెప్పినచోటు గనుక దీనికి కోళూరను పేరు గల్గెను. పెరుమాళ్లు శయనతిరుక్కోలములో సేవచేసి యున్నారు. బ్రాహ్మణులకుతప్ప

యితరులకు చక్కగా సేవకాదు. దూరములోనుండి సేవించ వలసి యున్నది. ఆవణినెల పునర్వసు నక్షత్రము రోజున తీర్థో త్సవము.

# 57. శ్రీవరమజ్గై - వానమామలై

ప్రభావము :— వానమామలై పెరుమాళ్, దైవ నాయకులు, తోతాద్రి పెరుమాళ్, శ్రీవరమజ్గ నాచ్చియార్, నందవర్ధన విమానము, ఇంద్రపుష్కరిణి, శేత్తుత్తామరై తీర్థము, తూర్పు తిరుముఖమండలము, వీత్తిరున్ద తిరుక్కోలము, శ్రీదేవి, భూదేవి, నీళాదేవి, సేన మొదలియార్, గరుత్మంతుడు, వీరలతో చామర కన్నికలు, చంద్రుడు, సూర్యుడు ప్రక్కన యుండగా, ఇంద్రునకు, బ్రహ్మకు, రోమ మహర్షికి, భృగు మహర్షికి, మార్కండేయునకు ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :— ఇయ్యాది తిరునెల్వేలికి దక్షిణమున రాజబాట మార్గముగా 20 మైళ్ల దూరములో నున్నది. ఇచ్చట సత్రమున్నది, భోజనశాలలు, కాఫీక్లబ్బులు వున్నవి, రామానుజకూటము లున్నవి. వానమామలై మఠమునందు అందరికిన్ని ప్రసాదము చిక్కును. మోటరుబస్సుల రాక పోకలు గలవు, బండ్లు గలవు. ఈ దివ్యదేశమున వేంచేసి

యుండు తాయార్ల తిరునామమే ఈ దివ్యదేశముయొక్క పేరాయెను. అష్టస్వయంవ్యక్త స్థలములలో నిది యొక్కటి. ఈ సన్నిధియందు వేంచేసియున్న పెరుమాళ్లను భూమినుండి యెత్తునపుడు వారి తిరుమేనియందు గాయము తగిలినందువల్ల ప్రతిరోజును పెరుమాళ్లకు యెణ్ణెకాప్పు తిరుమంజనము జరిపించెదరు. పంగుని ఉత్తరము నాడు కడపటి రోజుగా 10 దినములు బ్రహ్మోత్సవము జరిపించెదరు. ఈ దివ్యదేశమున భగవద్రామానుజ సిద్ధాంత ప్రవర్తకులైన వానమామలై జియ్యర్ ప్రధానమఠ మున్నది. ఇచ్చటనున్న తేనమాంపొళిల్ అను సుందరమైన నందవనము, పెరుమాళ్లయొక్క స్వర్ణగోరథము చూడతగినవి.



# 58. తిరుక్కురుజ్గుడి



ప్రభావము :—వైష్ణవనంబి, మలైనంబి, నింద్రనంబి. ఇరున్దనంబి, కిడన్దనంబి, తిరుప్పార్ కడల్ నంబి, కురుజ్గుడివల్లి నాంచారు, పఞ్చకేతక విమానము, తిరుప్పార్ కడల్ నది, పఞ్చ తురై, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుక్కోలము, ప్రక్కగా నున్న శివునకు ప్రత్యక్షము, నమ్మాళ్వారు, పెరియాళ్వారు తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—తిరునెల్వేలికి దక్షిణమున రాజబాటమార్గముగా 20 మైళ్ల దూరములోనున్న నాజ్గునేరి

(వానమామలై లేక శ్రీవరమంగై) నిరుతి దిశయందు రాజబాటమార్గముగా 8 మైళ్ల దూరములో నున్నది. బండ్లు వున్నవి, సత్రము లున్నవి, జియ్యర్ మఠమునందు అందరికి ప్రసాదములు చిక్కును. తిరునెల్వేలికి పడమట 10 మైళ్ల దూరములోనున్న శేర్మాదేవి స్టేషనుకు దక్షిణమున కళా కాట్టు (అరణ్యము) మార్గముగ 18 మైళ్ల దూరములో ఈ దివ్య దేశమున్నది. రెండెడ్లుల బండ్లు వున్నవి. ఈ స్థలమునకు పడమట 6 మైళ్ల దూరమున కొండమీదుగా నంబిసన్నిధి యున్నది. ఒంటరిగా పోవుటకు సాధ్యముకాదు. ప్రతివారము నాడు జనులు విశేషముగా అచ్చటికి పోయెదరు. ఈ కొండ యందు పులులు ఎలుగుబంట్లు మొదలగు దుష్టమృగములు విశేషముగా వున్నవి. ఈ సన్నిధిని భూదత్తాన్, బైరవుడు అను క్షుద్రదేవత లిద్దరు రక్షకులు.

ఉత్సవవైభవములు :—పంగుని ఉత్తరనక్షత్రము అవ సానముగా స్వామికి 10 దినములు బ్రహ్మోత్సవము జరు పబడును. పొట్టివాడైన వామనుడు వేంచేసియుండు చోటగుట వల్ల ఈ స్థలమునకు కురుఙ్గుడి యని పేరుగలైను. ఇచ్చటి పేశస్థులను (చక్కపరచుటకు) తమ దర్శనమునందు ఈడుపడు నట్లు చేయుటకు తిరువుళ్లము గలిగిన ఎంబెరుమానార్లను, తిరు వనంతపురములో వేంచేసియున్న అనంత పద్మనాభస్వామి తిరువుళ్లప్రకారము పెరియతిరువడి సిద్ధాశ్రమమైన ఈ క్షేత్ర మున విడిచిపోయిరి. వడుగనంబి రూపముతో ఈ సన్నిధి వడి వళగియనంబి ఉడైయవరులను ఆశ్రయించి మంత్రోపదేశము బొంది శ్రీవైష్ణవనంబి యను దాస్యనామమును పడసిరి.

శ్రీ భాష్యకారుల కాషాయవస్త్రములను వుతికి యెండపెట్టిన చోటు ఇప్పటికి తిరువట్టప్పారై యను పేరుతో నుండుట అందరికి నిదర్శనముగా కనబడుచున్నది. ఈ వైభవోత్సవము ప్రతి సంవత్సరమున ఆని మాసమున జరిపించెదరు. ఇచ్చట ఉడైయవరులు పెరుమాళ్లకు ఆచార్యస్థానమునందుండి మంత్రోపదేశము చేసినందువలన ఇచ్చట వేంచేసియున్న రామానుజులవారి విగ్రహము అంజలి హస్తముతో నుండక ఉపదేశ గమ్య చిన్ముద్రసేవతో కాన్పించుచున్నారు. ఈ సన్నిధియందున్న వడివళగియ నంబియొక్క సౌందర్యవిశేషములు సేవించు వారియొక్క హృదయములయందు నెలకొనియుండును. తిరుమంగయాళ్వారు తిరునాడలంకరించిన స్థలమిదియే. ఇప్పటికిన్ని వారిని తిరుప్పళ్లిచేర్చి యుండుచోటునందు వేంచేసియున్న తిరుమంగయాళ్వార్లను సేవించడము అవశ్యము. నింద్రనంబి, కిడందనంబి సన్నధులకు మధ్య శివుని ఆలయమువున్నది. పెరుమాళ్లులో ప్రదక్షిణనందు వేంచేయునపుడు శివుని కోవిలకు యెదురుగా నిలిచి మనప్రక్కనున్న శివునికి యేదైనా కొరత యున్నదో యన, శివుడు కొరతయేమిన్ని లేదు అని బదులు వుత్తరమిచ్చినపిదప తిరువీధులయందు వేంచేయుదురు.

పాండ్యదేశపు తిరుపతులు 18 సమాప్తము.



## మలయాళదేశపు తిరుపతులు – 13

(చేరదేశపు తిరుపతులు)

## 59. తిరువనంతపురము – అనంతశయనం

ప్రభావము :—అనంతపద్మనాభులు, శ్రీహరి లక్ష్మి నాచ్చియార్, హేమకూటవిమానము, మత్స్యతీర్థము, తూర్పు తిరుముఖమండలము, భుజఙ్గశయనము, రుద్రునికి, చంద్రునికి ఇంద్రునికి ప్రత్యక్షము, నమ్మాళ్వారు, పెరియాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది తిరువనంతపురం స్టేషనుకు తూర్పున రాజబాటమార్గముగా 2 మైళ్ల దూరములో నున్నది. భోజనశాలలు, సత్రములు, కాఫీక్లబ్బులు వున్నవి.

ఈ పట్టణము తిరువాఙ్కూరు రాజ్యమునకు ముఖ్య పట్టణము, కోట మధ్యయందు అనంత పద్మనాభస్వామి సన్నిధి యున్నది. శ్రీమహారాజుగారి అంతఃపురమును, యువరాజుగారి అంతఃపురమును, రాణీ అంతఃపురమును, హైకోర్టు మొదలగు కట్టడములు, జంతుదృశ్యశాల, శృంగారవనము, సముద్రతీరము మొదలగునవి చూచుటకు రమణీయ్యముగా నుండును. ఈ

మలయాళదేశము పడమటి కనుములకును, పశ్చిమ సముద్రము నకును మధ్యనుండు తిరువాన్కూరు, కొచ్చి రాజ్యములుగా నున్నవి. ఈ దేశమునకే చేరదేశమని పేరు. ఈ దేశమునందు కొబ్బరిచెట్లు, పోకచెట్లు, పనసచెట్లు అపరిమితముగా నున్నవి. ఇచ్చట కొండచరియలయందు ఏనుగులు విశేషము. ఈ దేశ మున 8800 అడుగులు యెత్తైన యానైమలై (ఏనుగ కొండ) 6200 అడుగులు యెత్తుగల అగస్త్యులకొండ, ఏలక కాయల కొండ మొదలగు ప్రధానమైనకొండలు. ఏలక్కాయ కొండ యందు ఏలక కాయలు విశేషముగా పండుచున్నవి. ఇచ్చట ప్రవహించు తామ్రపర్ణినదియు, పెరియారు ఈ దేశములో పాఱునదులలో పెద్దవి. ఇచ్చట జనులు హిందువులుగా నుండి నను వారి ఆచారములు మనకు పట్టవు, మన యాచారములు వారికి పట్టవు. ఈ దేశములో వాడబడు భాష మళయాళము. ఈ మలైనాడులో నున్న తిరుపతులలో వేంచేసియున్న స్వా ములకు వడగల తెంగల కానటువంటి యొక విధమైన తిరు మణికాప్పులను గోపితో పూర్ధ్వపుండ్రమును చందనముతో బొట్టును వుంచెదరు. ఈ దేశమున శైవ వైష్ణవ మత భేదమను నది లేదు. బ్రాహ్మణులకు అధిక మర్యాదగలదు. బ్రాహ్మ ణులకు తప్ప యితరులకు సన్నిధిలో తీర్థము తుళసి మొదలగు నవి యిచ్చుటలేదు. పెరుమాళ్లు సమీపమునందు జనులను సేవించుటకు విడువరు. అయినను పెరుమాళ్ల సన్నిధి వున్నత ముగా కట్టియుండుటవలన దూరముగానుండి సేవించువారికి చక్కగా సేవయగును.



# 60. తిరువణ్ పరిశారం

ప్రభావము :—తిరుక్కురళప్పన్, తిరువాళ్ మార్బన్, కమలవల్లి నాంచారు, ఇంద్రకల్యాణవిమానము, లక్ష్మితీర్థము, తూర్పు తిరుముఖమండలము, వీత్తిరున్ద తిరుక్కోలము, విస్తరు, కారికి, ఉడైయనంగకు, ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది తిరుక్కురుఙ్గుడికి దక్షిణమున 9-మైళ్ల దూరములోనున్న పనైకుట్టినిజేరి అచ్చటినుండి వాయవ్యమున 14 మైళ్లు దూరముపోయి (నాగర్ కోవిలకు సమీపమున) వుత్తరముగా తిరిగి ½ మైలు దూరముపోయి ఈ దివ్యదేశమును చేరవలయును. తిరువట్టారునకు దక్షిణమున 8 మైళ్ల దూరములోనున్న తక్కలై (పద్మనాభపురం) కు ఆగ్నేయమున 10 మైళ్లు దూరములోనున్న నాగర్ కోవిలకు నీశాన్యమున 1½ మైలు దూరములో వున్నది. బండ్లు, మోటరు బస్సులు వున్నవి. సత్రములు వున్నవి. ఈ స్థలమునకు దక్షిణమున 12 మైళ్ల దూరములో మరియొక క్షేత్రమైన కన్యాకుమారియున్నది. ఇచ్చట దక్షిణ సముద్రస్నానము విశేషము.

శ్రీ నమ్మాళ్వారుల తల్లిగారయిన ఉడయనంగ (నాథనాయకమ్మ) అవతరించిన స్థలమిదియే. ఈ స్థలము మలయాళదేశములో వున్నను యిచ్చటవున్న జనులు చాలాభాగము ద్రావిడభాషనే వుపయోగించెదరు.



# 61. తిరువట్టారు



ప్రభావము :—ఆదికేశవప్పెరుమాళ్లు, మరకతవల్లి నాచ్చియార్, అష్టాంగవిమానము, కడల్ వాయితీర్థము, రామ తీర్థము, దక్షిణ తిరుముఖమండలము, భుజఙ్గశయనము, పరశు రామునికి, చంద్రునికి ప్రత్యక్షము. నమ్మాళ్వారు మంగళా శాసనము.

మార్గవసతులు :—తిరువన్ పరిశారమునకు నైరుతి యందు 2 మైళ్ల దూరములో నుండు నాగర్ కోవిలకు వాయ వ్యముగ రాజబాటమార్గముగా 16 మైళ్ల దూరములోనున్న తొట్టిపట్టిని చేరి, అచ్చటనుండి వుత్తరము 3 మైళ్ల దూరము పోయి యీ దివ్యదేశము చేరవలయును. తిరువనంతపురమునకు ఆగ్నేయమున రాజబాటమార్గముగా 24 మైళ్ల దూరములో నున్న మార్తాండమునకు వుత్తరమున 4 మైళ్ల దూరములో ఈ దివ్యదేశము వున్నది. బండ్లు, బస్సులు, సత్రములు వున్నవి. ఈ స్థలమునకు యిరుపక్కలయందు నదులు ప్రవహించుట చేత ఈ క్షేత్రమునకు తిరువట్టారు అని పేరు గల్గెను. ఇయ్యది యొక చిన్నపట్టణముగా నుండుటవలన సర్వ సౌకర్యములు గలిగివున్నది. ఈ దివ్యదేశమే పరశురామక్షేత్రము. ఇచ్చట నున్న వొంటిరాయి మంటపమునందు వేంచేసియున్న పెరు మాళ్లను సేవించుటకును, సన్నిధి గోడలను తాకుటకును, బ్రాహ్మణులు కాని వారికి స్వాతంత్రములేదు.



## 62. తిరుశెఙ్కుణ్ణూర్ - శెంగణూర్

ప్రభావము:—ఇమైయవరప్పన్ శెఙ్గమలవల్లి నాచ్చియార్, జగజ్జ్యోతి విమానము, తిరుశిత్తారు, శంఖతీర్థము, పశ్చిమ తిరుముఖమండలము, నిన్నతిరుక్కోలము, భస్మాసురుని నిమిత్తముగా శివునికి ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యాది కోట్టారక్కరై స్టేషనుకు 30 మైళ్ల దూరములో యున్నది. కొల్లమునుండి వుత్తరమున కెనాల్ మార్గముగ 40 మైళ్లు పోయి అంబలప్పుళైని చేరి 18 మైళ్లు పోయిన ఈ దివ్యదేశముఁజేరవచ్చును. సత్రములు, బండ్లు వున్నవి. ఈ దివ్యదేశమునకు తూర్పున 3 మైళ్ల దూరములో తిరువాఱన్ విళైయును,నిరుతి దిశయందు 4 మైళ్ల దూరములో తిరుప్పులియూరును, వాయవ్యమున 5 మైళ్ల దూరములో తిరువణ్వణ్డూరును, వాయవ్యమున 10 మైళ్ల దూరములో తిరువల్లవాయును, 14 మైళ్ల దూరములో తిరుక్కడిత్తానమును్న వున్నవి.

# 63. తిరుప్పులియూర్ – పులియూర్

(కుట్టకొడు)



ప్రభావము :—మాయప్పిరాన్, పొర్కొరి నాచ్చియార్, పురుషోత్తమవిమానము, పూంజునై తీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, సప్త ఋషులకు ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది తిరువనంతపురం-శెంకోట్టై రైలుమార్గముగా కొట్టారకరై స్టేషనుకు పడమట30 మైళ్ల దూరములోనున్న శెంగణూరికి 3 మైళ్ల దూరములోనున్నది. ఇచ్చట వేంచేసియున్న పెరుమాళ్లు తిరుముఖమండలమునందు రజిత (వెండి) కవచము ధరించి యుండుట విస్మయముగా నుండును. ఈ పెరుమాళ్లు పంచపాండవులలో నొకడైన భీమునిచే ప్రతిష్ఠ గావింపబడినదని చెప్పుచున్నారు. ఊరు మిగుల చిన్నదిగా నుండుటచేత సౌకర్యములు లేవు.



# 64. తిరువణ్ వణ్డూర్ – తిరువముణ్డూర్



ప్రభావము :—పాంబణై యప్పన్, కమలవల్లి నాచ్చియార్, వేదాలయ విమానము, పాపనాశతీర్థము, దక్షిణ తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, మార్కండేయునికి, నారదునికి ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది తిరుప్పులి యూరునకు వుత్తరమున 3 మైళ్ల దూరములోను, శెజ్గణూరుకు పడమట 5 మైళ్ల దూరములోనున్ను, తిరువల్లాయికి దక్షిణమున 5 మైళ్ల దూరములోను నున్నది. అప్పలంపుళైనుండి తూర్పున కాలువ మార్గముగా 16 మైళ్ల దూరముపోయి ఈ దివ్యదేశ మును చేరవచ్చును. ఈ సన్నిధి పెరుమాళ్లు పంచపాండవు లలో నొకడైన నకులునిచే ప్రతిష్ట గావింపబడినదని చెప్పె దరు. ఈ సన్నిధికి ధ్వజ స్థంభముగాని ద్వారపాలకులుగాని లేరు. ఈ క్షేత్రము చిన్న గ్రామ మగుటచేత సౌకర్యములు లేవు.

## 65. తిరువల్లవాయ్ – తిరువల్లాయ్

ప్రభావము :—కోలపిరాన్, శెల్వ తిరుక్కొళున్దు నాచ్చియార్, చతురంగకోల విమానము, ఘంటాకర్ణతీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్నతిరుకోలము, ఘంటాకర్ణు నికి ప్రత్యక్షము. నమ్మాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగ శాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది తిరువణ్వణ్డూరునకు వుత్త రమున 4 మైళ్ల దూరములో నున్నది. ఇయ్యది పెద్ద నగర మగుటచేత సర్వసౌకర్యములు గలిగియున్నది. భోజనశాల

వున్నవి. ఈ సన్నిధి తిరుమాళ్లు శ్రీకృష్ణమూర్తివల్ల ప్రతిష్ఠ గావింపబడినదట. ఇచ్చట చతురంగకోట విమానమునకు వైపున చక్రత్తాళ్వారులను ప్రతిష్ఠ చేయబడియున్నది. ఈ చక్రత్తాళ్వార్ల సన్నిధియందు విభూతిని వినియోగపరచుట విస్మయమే. ఈ సన్నిధియందు పెరుమాళ్లను సేవించుటకు స్త్రీలు తప్ప పురుషులు మాత్రమే లోపలపోయి సేవించవల యును. స్త్రీలు వెలుపటనుండియే సేవింపవలెను. ఈ దివ్య దేశము పంపానదీ తీరమున నున్నది.



# 66. తిరువారణ్‌విళై



ప్రభావము :—తిరుక్కురళప్పన్, పద్మాసన నాచ్చి యారు, వామనవిమానము, వేదవ్యాస సరస్సు, ఉత్తర తిరు ముఖమండలము, విన్న తిరుక్కోలము, బ్రహ్మకు ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యది తిరుచ్చెంగనూరుకు తూ ర్పున రాజబాటమార్గముగా 7 మైళ్ల దూరములో నున్నది. ఈ దివ్యదేశ పెరుమాళ్లు పంచపాండవులలో నొకడయిన అర్జు నునిచే స్థాపించబడినదని చెప్పెదరు. ఇది యొక చిన్ననగర మైనందున చాలినంత సౌకర్యములు గలిగియున్నది. అనుదిన మును మూలవరులకు తిరుమంజనము జరిపి పలువిధ పుష్ప ములచేత నలంకరించి యుండుటను సేవించవలసినది. ఈ దివ్య దేశము పంపానదీ తీరమునం దున్నది.



# 67. తిరుక్కడిత్తానం



ప్రభావము:—అద్భుతనారాయణుడు, కల్పకవల్లి తాయారు, పుణ్యకోటి విమానము, భూమితీర్థము, తూర్పు తిరుముఖ మండలము, చిన్న తిరుకోయిలము, రుక్మాంగదరాజునకు ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యాది తిరువల్లవాయ్ (తిరువల్లాయి) కి వుత్తరమున రాజబాట మార్గముగా 5 మైళ్ల దూరములోనున్న శెంగనాశ్శేరినుండి మంటిబాటమార్గముగా 2 మైళ్ల దూరము పోయిన ఈ దివ్యదేశము చేరవచ్చును. ఈ సన్నిధి పెరుమాళ్లు వంశపాండవులలో నొకడైన సహదేవునివల్ల ప్రతిష్ఠ గావింపబడినది. ఈ క్షేత్రము మిగుల చిన్న గ్రామ మగుటచేత సౌకర్యములు లేవు.



# 68. తిరుకాట్కరై



ప్రభావము:—కాట్కరైయప్పన్, పెరుంశెల్వనాయకి, పుష్కలవిమానము, కపిలతీర్థము, దక్షిణ తిరుముఖమండలము, చిన్న తిరుకోయిలము, కపిలమునికి ప్రత్యక్షము, నమ్మాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది షొరానూర్-ఎర్ణాకుళం లైనుమార్గములో నున్న ఇడైప్పల్లి స్టేషనుకు తూర్పున రాజ బాటమార్గముగా 2 మైళ్ల దూరములో నున్నది. సత్రములు, బండ్లు గలవు.

## 69. తిరుమూళిక్కళం

ప్రభావము :—తిరుమూళిక్కత్తాన్, మధురవేణినాచ్చి యారు, సౌందర్యవిమానము, పెరుంకుళతీర్థము, తూర్పు తిరు ముఖమండలము, నిన్న తిరుకోలము, హారీత మహామునికి ప్రత్యక్షము, నమ్మాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళా శాసనము.

మార్గవసతులు :—షొరానూర్ - ఎర్ణాకుళం లైను మార్గములో నున్న అంగమాలి స్టేషనుకు పడమట రాజ బాట మార్గముగా 6 మైళ్ల దూరములో నున్నది. బండ్లు సత్రములు గలవు.

## 70. విత్తువక్కోడు

ప్రభావము :—ఉయవన్దపెరుమాళ్లు, విత్తువక్కొట్టు వల్లి నాచ్చియారు, రత్నకాంచన విమానము, చక్రతీర్థము, దక్షిణ తిరుముఖమండలము, భుజంగశయనము, అంబరీషునకు ప్రత్యక్షము, కులశేఖరాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—షొరానూర్ - కళ్లికోట లైను మార్గములో నున్న పట్టాంబి స్టేషనుకు దక్షిణమున 1 మైలు దూరములో నున్నది. బంగ్లాలు గలవు, సత్రమున్నది.

# 71. తిరునావాయ్

ప్రభావము :—నారాయణులు, మలర్మంగనాచ్చియారు, వేదవిమానము, సెంగమలసరస్సు, దక్షిణ తిరుముఖ మండలము, వీత్తిరుంద తిరుక్కోలము, లక్ష్మికి, గజేంద్రునికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—ఇయ్యాది మదరాసు-కళ్లికోట లైను మార్గముగా 232 మైళ్లు దూరములోనున్న ఎడకుళం స్టేషనుకు దక్షిణమున 1 మైలు దూరములో నదీతీరముననున్నది సత్రమున్నది.

తిరువనంతపురమునకు వుత్తరమున 22 మైళ్ల దూరములో నున్న జనార్దనమునకు తూర్పున 7 మైళ్ల దూరములో నున్న నావాయ్కుళమును కొందరు తిరునావాయ్ దివ్యదేశమని చెప్పెదరుగాని అది వట్టికల్ల. అచ్చట ప్రబలమైన శంకర నారాయణులసన్నిధి వున్నది.

మళయాళ దేశపు (చేర దేశపు)

తిరుపతులు 13 సమాప్తము.

# మధ్యదేశపు తిరుపతులు 2

## 72. తిరువయింద్రపురం

ప్రభావము :—దైవనాయక పెరుమాళ్లు, వైకుంఠ నాయకి, ఇంద్రవిమానము, గరుడనది, శేషతీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, ఇంద్రునకు గరుడునకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు :—తిరుప్పాపులియూర్ స్టేషనునుండి రాజబాటమార్గముగా 3 మైళ్ల దూరములో నీ దివ్యదేశ మున్నది. తిరుప్పాపులియూరు స్టేషనుకు ప్రక్క స్టేషనగు వర క్కాల్ పట్టి స్టేషనునుండి చేనిగట్టులమీాది కాలిబాటమార్గ ముగా 1 మైలు దూరములో నీదివ్య దేశమున్నది. బండ్లు వున్నవి, కాఫీక్లబ్బు లున్నవి, సన్నిధియందు ప్రసాదములు చిక్కును. కొండమీాదు హాయగ్రీవుల సన్నిధియున్నది.

ఉత్సవవైభవములు :—చిత్రినెల పౌర్ణమిరోజు అవ సానముగా 10 దినములు బ్రహ్మోత్సవము పెరుమాళ్లకు జరు గును, మార్గళి నెలయందు 20 దినములు అధ్యయనోత్సవము,

పెరటాశినెల శ్రవణ నక్షత్రమురోజు సమాప్తిగా 10 దిన ములు వుత్సవము వేదాంత దేశికులకు జరుగును. తిరువేంగ డముడైయాన్ ఘంట (తిరుమణియాళ్వార్) అవతారమైన శ్రీ మన్నిగమాన్త మహాదేశికులకు ప్రప్రథమమున హాయ గ్రీవులు ప్రత్యక్షమైన స్థలము.



# 73. తిరుక్కోవలూర్



ప్రభావము:—త్రివిక్రముడు, ఆయనార్, పుంగో ల్వల్లి నాచ్చియార్, శ్రీకర విమానము, కృష్ణతీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుక్కోలము, మృకండుమునికి, బలిచక్రవర్తికి ప్రత్యక్షము, పొయ్‌గైయాళ్వారు, పూదత్తా ళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—విళిప్పురం - కాట్పాడి లైనులో నున్న తిరుక్కోవలూర్ స్టేషను నుండి నిరుతి దిశయందు రాజ బాటమార్గముగా 2 మైళ్ల దూరములో నున్నది. వర్షాకాల ముందు మార్గ మధ్యనుండు దక్షిణ పెన్నానదిని పడవలవల్ల దాటవచ్చును. ఇయ్యది సుందరమైన నగరమగుటచే సర్వ సౌకర్యములు గలిగియున్నది. కాఫీక్లబ్బు లున్నవి, రామా నుజకూట మున్నది, సన్నిధిలో ప్రసాదము చిక్కును.

**ఉత్సవవైభవములు** :—పంగుని నెలయందు ఉత్తరా నక్షత్రమురోజు సమాప్తిగా 10 దినములు బ్రహ్మోత్సవము జరుగును. కార్తీక మాసమందు కైశిక ఏకాదశి వుత్సవమున్ను, మరునాడు 74 సింహాసనాది పతులలో నొకరైన ఎంబెరు మానార్ జియ్యరుకు బ్రహ్మ రథవుత్సవము అతి విభవముగా జరుగును. పెరుమాళ్ల శ్రీశరగోపమునందు గలగల శబ్దమొం డుట సేథంచువారికి విస్మయము గలిగించును. పన్నిద్దరాళ్వా ర్లలో ముదలాళ్వార్లయిన పొయ్గైయాళ్వారు, పేయాళ్వారు, పూదత్తాళ్వారు ఒకరివెనుక నొకరుగావచ్చి ఈ దివ్యదేశ తిరు వీధిలో నొక గృహముయొక్క అరుగున వేంచేసియుండు తరుణ మున వీరి అంగ సంశ్లేషమును గోరి పెరుమాళ్లు వీరి మధ్య అదృ శ్యముగా నిలిచి చోటును యిరుకగునట్లుచేసి సేవిసాయించి మంగళాశాసనములు పొందిరి. ముదలాళ్వార్లు ముగ్గురు తిరు నాడలంకరించిన స్థలమిదియే. ఈ దివ్యదేశమున కుండు మహా త్మ్యము వేరే దివ్యదేశమునకున్ను లేదు. ఈ సన్నిధిలో నున్న దుర్గకు పూజ జరుగుట గమనించతగినది.

మధ్యదేశపు తిరుపతులు 2 సమాప్తము.



# చదువరులకొరకు

# విజ్ఞాపన.

---

ఇందలి ప్రథమభాగమునందు గల పేజీ నెంబర్లు 88 యని ముగింపుఅయినది. ద్వితీయభాగము ప్రారంభములో పేజీనెంబర్లు 89 యని అచ్చుపడుటకుబదులుగా 65 యని ప్రారంభించి ఆఖరు వరకు అదేవరుసలో ముగింపుఅయినది. అది పొరబాటు. అందుకుబదులుగా 89 నెంబరునుండి ఆఖరువరకు ఈ వరుసక్రమముగా పేజీ నెంబర్లు లెక్క వుంచుకొనగలందులకుప్రార్థించుచున్నాడను.

ఇట్లు,

శ్రీరంగం చిన్నసామయ్య.

# తొండ దేశపు తిరుపతులు. 22,

## 74. కాంచీపురము - హస్తిగిరి.

ప్రభావము:—వరదరాజ పెరుమాళ్ళు, పెరుందేవితా యార్, పుణ్యకోటి విమానము, సత్యవ్రత క్షేత్రము, అనంత సరస్సు, శేషతీర్థము, వరాహతీర్థము, బ్రహ్మతీర్థము, పద్మతీర్థ ము, అగ్నితీర్థము, కుశలతీర్థము, వేగవతి నది, పశ్చిమ తిరుముఖ మండలము, నిన్న తిరుక్కోలము, నారదునికి, తిరుపనంతాళ్వా నుకు, గజేంద్రునకు, బ్రహ్మకు ప్రత్యక్షము.

అళగియశింగిర్ పెరుమాళ్ళు, హరిద్రాదేవి తాయారు, వారణగిరి, గుహవిమానము, వీత్తిరుంద తిరుకోలము, బృహస్ప తికి ప్రత్యక్షము, పూదత్తాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగ ళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది కాంచీపురం స్టేషనుకు దక్షి ణమున 2 మైళ్ళదూరములోనున్నది. బండ్లువున్నవి, సత్రములు, భోజనశాలలు, కాపీక్లబ్బులు వున్నవి.

కాఞ్చీపురము విష్ణుకంచి - లేక చిన్నకంచి యనియు, శివకంచి—లేక పెద్దకంచియనియు రెండుభాగములుగా నున్ననొక పెద్ద మునిసిపల్ పట్టణము. చిన్నకంచియందు హస్తిగిరి (వరదరాజు లసన్నిధి) తిరువెక్కా (యథోక్తకారిసన్నిధి), తిరుత్తణ్గా, అష్ట

భుజం, వేళుక్కై యను 5 దివ్యదేశములును, పెద్దకంచియందు ఊరగం, నీరగం, కారగం, కార్వానం, కళ్వనూర్, పాడగం, నీలాతిణ్ణళ్ తుండం మొదలగు 9 తిరుపతులున్నవి. ఈదివ్యదేశమునకు 7 మైళ్ళదూరములో తిరుప్పకుళి యున్నది. పూర్వమున నీక్షేత్రమునందు 18 విష్ణు ఆలయములున్ను, 23 తీర్థములును, 6 నదులును వుండినట్లుచెప్పెదరు.

ఉత్సవవైభవములు:—వైయ్యాశినెల చిత్తానక్షత్రము రోజున బ్రహ్మోత్సవ ధ్వజారోహణము. చిత్రాపౌర్ణమి నాడు అయ్యంకుళం నడబావి వుత్సవము. పెద్దకంచిలోనున్న ఏకాంబరేశ్వరునిగుడి, కామాక్షిగుడి, కుమరగోష్టం మొదలగు శివాలయములున్ను, వేగవతీనది దక్షిణ తీరమున నున్న శమణాలయము మొదలగునవి చూడతగినవి.



# 75. తిరువెఃక్కా యదోత్కారి సన్నిధి.



ప్రభావము:—శొన్నవణ్ణం శెయ్దపెరుమాళ్ (యధోత్కారి), కోమళవల్లినాచ్చియార్, వేదసారవిమానము, పొయ్గై పుష్కరిణి, పశ్చిమ తిరుముఖమండలము, భుజంగశయనము పొయ్గైయాళ్వారుకు, కనిక్కణ్ణనుకు, బ్రహ్మకు, ప్రత్యక్షము పొయ్గైయాళ్వారు, పేయాళ్వారు, తిరుమళిశైయాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది చిన్నకంచిలోనున్న రెండవ తిరుపతి. వరదరాజపెరుమాళ్ళసన్నిధికి పశ్చిమమున $\frac{1}{4}$ మైలు దూరములోనున్నది. పంగునిమాసములో రేవతీ నక్షత్రము రోజున సమాప్తిగా 10 దినములు బ్రహ్మోత్సవము జరుగును.



# 76. అష్టభుజం - అష్టభుయకరం.



ప్రభావము:—ఆదికేశవ పెరుమాళ్ళు, చక్రధరుడు, అలర్‌మేల్ మంగనాచ్చియార్, గఘనాకృతి విమానము, గజేంద్రపుష్కరిణి, పశ్చిమ తిరుముఖ మండలము, నిన్నతిరుకోలము, గజేంద్రాళ్వారునకు ప్రత్యక్షము, పేయాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము, ఇయ్యదిచిన్నకంచిలో నున్న మూడవ తిరుపతి.

మార్గవసతులు:—వరదరాజ పెరుమాళ్ సన్నిధికి పశ్చిమమున $\frac{3}{4}$ మైలుదూరములో నున్న యథోత్కారిసన్నిధికి 2 పర్లాంగుల దూరములోనున్నది.



# 77. వేళుక్కై.

ప్రభావము:—ముకుంద నారాయణులు, వేళుక్కైవల్లి నాచ్చియార్, కనకవిమానము, కనకసరస్సు, తూర్పుతిరుముఖ

మండలము, నిన్నతిరుకోల్కలము, భృగుమహర్షికి ప్రత్యక్షము, పెరియాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

## 78. తిరుత్తణ్గా - విళక్కోల్కళికొయిల్.

ప్రభావము:—విళక్కోల్కళి, దీప ప్రకాశులు, దివ్యప్రకాశుడు, మరకతవల్లి తాయార్, శ్రీకరవిమానము, సరస్వతితీర్థము, పశ్చిమ తిరుముఖమండలము, నిన్నతిరుకోల్కలము, సరస్వతికి ప్రత్యక్షము, పూదత్తాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళా శాసనము.

మార్గవసతులు అష్టభుజంనరసింహస్వామి సన్నిధికి పశ్చిమమున 2 ఫర్లాంగుల దూరములో నున్నది. ఇయ్యది చిన్న కంచిలోనున్న నాల్గవ తిరుపతి.

## 79. పాడగమ్ – పాండవ పెరుమాళ్.

ప్రభావము:—పాండవదూతులు, రుక్మిణీదేవి, సత్యభామ, భద్రవిమానము, మత్స్యతీర్థము, తూర్పుతిరుముఖమండలము, వీతిరుంద త్తిరుకోల్కలము, హారీతమహా మునికిప్రత్యక్షము పూదత్తాళ్వారు, పేయాళ్వార్, తిరుమయిశైయాళ్వార్, తిరుమంగ యాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది పెద్దకంచిలోనులున్న 9 తిరుపతులలో ఆరవ తిరుపతి. ఇయ్యది ఏకాంబ్రేశ్వరునిగుడివీధికి పడమట 1 పర్లాంగు దూరములో నున్నది.

# 80 నిళాత్తింగళ్ తుణ్డమ్.



ప్రభావము:—నిళాత్తింగళ్ తుణ్డత్తాన్, నేరొరువదిల్లావల్లి నాచ్చియార్, పురుషసూక్తవిమానము, చంద్రపుష్కరిణీ, పడమట తిరుముఖమండలము, నిన్నతిరుకోలము, శివునికిప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది పెద్ద కంచి లోనున్న 7 వ తిరుపతి, ఈసన్నిధి ఏకాంబేశ్వరుని ఆలయములో మొదటి ప్రాకారములో నున్నది.



# 81. పవళవణ్ణమ్ - పవళవణ్ణార్.



ప్రభావము:—పవళవణ్ణ ప్పెరుమాళ్, పవళవల్లి నాచ్చియార్, ప్రవాళవిమానము, చక్రతీర్థము, పశ్చిమతిరు ముఖమండలము, నిన్నతిరుకోలము, అశ్వనీదేవతలకు, పార్వతికి ప్రత్యక్షము. తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు—ఇయ్యది పెద్దకంచిలోనున్న ఎనిమిదవ తిరుపతి . కామాక్షిగుడికి వుత్తరమున ౹ మైలుదూరములో నున్నది, ఈసన్నధికి పశ్చిమమున పచ్చవణ్ణర్ సన్నిధియున్నది.

పచ్చవణ్ణర్ సన్నిధి- ప్రభావము:-పచ్చవణ్ణ ప్పెరుమాళ్ మరకతవల్లి తాయార్, మరకతవిమానము, భృగుతీర్థము, తూర్పుతిరు ముఖమండలము, నిన్నతిరుకోలము, భృమహార్షికి ప్రత్యక్షము ఇయ్యది పవళవణ్ణర్ సన్నిధి వీధియందు పశ్చిమ మున ఎదుటనున్నది.

# 82. ఊరగమ్ - ఉలగళన్ద పెరుమాళ్.

ప్రభావము:—ఉలగళన్ద పెరుమాళ్, త్రివిక్రముడు, అముదవల్లి నాచ్చియారు, సార శ్రీకరవిమానము, నాగతీర్థము పశ్చిమ తిరుముఖమండలము, నిన్నతిరుకోలము, ఊరగమను ఆదిశేషునకు ప్రత్యక్షము తిరుమళిశైయాళ్వారు మంగళా సనము.

మార్గవసతులు:—ఇయ్యది పెద్దకంచిలో నున్న 9 తిరుపతులలో మొదటిది. కామాక్షిగుడికి సమీపముననున్నది. ఈసన్నిధి యందే నీరగం, కారగం, కార్వానం మొదలగు సన్నధులు వున్నద.

# 83. కారగమ్.



ప్రభావము:—కరుణాకర ప్పెరుమాళ్, పద్మామణినాచ్చియారు, వామనవిమానము, అక్కూరాయతీర్థము, దక్షిణతిరుముఖమండలము, గార్హ్యాఋషికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము, ఇయ్యది పెద్దకంచిలో నున్న 9 తిరుపతుల లోమూడవ తిరుపతి పెరుమాళ్ళ సన్నిధి, ఉలగళన్దపెరుమాళ్ సన్నిధిలో తాయార్ల సన్నిధికి యెదురుగా నున్నది.



# 84. నీరగం.



ప్రభావము:-జగదీశ ప్పెరుమాళ్, నిలమంగవల్లి నాచ్చియార్, జగదీశ్వర విమానము, అక్రూరతీర్థము, తూర్పు తిరుముఖ మండలము, నిన్నతిరుక్కోలము, అక్రూరమహర్షికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వార్ల మంగళాశాసనము.

ఇయ్యది పెద్దకంచిలో నున్నరెండవ తిరుపతి, ఉళగళన్ద పెరుమాళ్ సన్నిధియందు వుత్తర ప్రాకారములో నున్నది.



# 85. కార్వానం.



ప్రభావము:—కళ్వర్ పెరుమాళ్, కమల వల్లి నాచ్చియార్, పుష్కలవిమానము, గౌరీతటాకము, పశ్చిమతిరు ముఖమండలము, నిన్నతిరుక్కోలము, పార్వతికిప్రత్యక్షము, తిరుమంగమాళ్వారు మంగళాశాసనము. ఇయ్యది ఉళగళన్దపెరుమాళ్ సన్నిధిలో నేయున్నది. ఇయ్యది పెద్ద కంచిలోనున్న. 9 తిరుపతులలో నాల్గవతిరుపతి.



# 86. తిరుక్కళ్వనూర్.

ప్రభావము:- ఆదివరాహప్పెరుమాళ్, అఞ్జిలై వల్లినాచ్చియార్, వామనవిమానము, నిత్యపుష్కరిణి, పశ్చిమ తిరుముఖమండలము, నిన్నతిరుక్కోలము, అశ్వత్థనారాయణునకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:- ఇయ్యదిపెద్దకంచిలో నున్నతొమ్మిది తిరుపతులలో అయిదవది, ఇది కామాక్షిగుడిలోనున్నది. శైవులు ఆరాధించెదరు, (భూమునిచాపగాచుట్టి పాతాళమునకు కొనిపోయిన హిరణ్యాక్షుని జంపి భూదేవిని వుద్ధరించిన అవసర భావముతో ఈపెరుమాళ్లు వేంచేసి యున్నారు) ఈ సన్నిధి గుంటకు ఈశాన్యమూలయందు నినార్క్ ఇరున్దార్ కిడన్దార్ అనుసన్నిధి ఒక్కటి యున్నది. దీనినిచూచుటకు అపేక్షించు

వాడు చీకటిలోనున్న పడికట్లను ఎక్కిపోవలసియున్నది గాన యుండుటచేత పగటియందు కూడా జాగ్రతగా పోవలయును.

# 87. పరమేచ్చురవిణ్ణగరమ్ వైకుంఠ పెరుమాళ్.

ప్రభావము:—పరమపదనాథుడు, వైకుంఠనాచ్చియార్, ముకుంద విమానము, ఐరమతీర్థము, పశ్చిమతిరుముఖమండలము, వీత్తిరుందతిరుక్కోలము, పల్లవరాయునకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యాది పెద్దకంచిలోనున్న తొమ్మిదవ తిరుపతి కాంచీపురము స్టేషనుకు ½ మైలులోనున్నది. ఇయ్యాది పెద్దకంచిలోనున్న తొమ్మిది తిరుపతులలో 8 వ వది.

# 88. తిరుప్పుట్కుళి.

ప్రభావము:—విజయరాఘవప్పెరుమాళ్, మరకతవల్లి నాచ్చియార్, విజయకోటి విమానము, జటాయుతీర్థము, తూర్పుతిరుముఖమండలము, వీత్తిరుంద తిరుక్కోలము, జటాయువునకు ప్రత్యక్షము, తిరుమంగళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యాది పెద్దకంచికి పడమట రాజబాటమార్గముగా 7 మైళ్ళదూరములోనున్నది, సత్రమున్నది,

భోజనశాలలు లేవు, సన్నిధియందు ప్రసాదముచిక్కడ మరుదు. మాశినెలయందు పునర్వసు నక్షత్రమురోజు సమాప్తిగా 10 దినములు బ్రహ్మోత్సవము జరుగును.

# 89. తిరువల్లి క్కేణి.

ప్రభావము:—బృందారణ్యక్షేత్రము, పార్థసారథి, రుక్మిణిపిరాట్టి, అనిరుద్ధుడు, ప్రద్యుమ్నుడు, బలరాముడు, సాత్యకి, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, ఆనందవిమానము, వ్యాసమహర్షివల్ల ప్రతిష్ఠింపబడి ఆత్రేయమహర్షివలన నారాధింపబడినవారు, సుమతియను రాజునకు, తొండమాను చక్రవర్తికి, అర్జునునకు ప్రత్యక్షము.

మన్నాథుడు (రంగనాథుడు), వేదవల్లి తాయారు, భుజంగ శయనము, తూర్పు తిరుముఖమండలము, భృగు మహర్షివల్ల కన్యాదానము పొందినవారు.

తెల్లియసింగర్, నరసింహస్వాములు, పశ్చిమ తిరుముఖమండలం, వీత్తిరుందతిరుకోలము, అత్రిమహర్షికి, జాలి మహర్షికి ప్రత్యక్షమై మోక్షమిచ్చినవారు.

చక్రవర్తి తిరుమగన్ శ్రీరాములు, భరతాళ్వారు, శత్రుఘ్నాళ్వారు, లక్ష్మణులు, మైథిలి, సీతాదేవి, దక్షిణతిరుముఖమండలము, నిన్న తిరు క్కోలము, శశపదుని కుమారుండైన మధుమానను మహర్షికి ప్రత్యక్షము.

తేవప్పెరుమాళ్, వరదరాజులు, తూర్పు తిరుముఖమండలము, గరుడారూఢులు, సప్తరోమునకు ప్రత్యక్షము, శేషవిమానము, ఇంద్రతీర్థము, సోమతీర్థము. మీనతీర్థము, అగ్నితీర్థము, విష్ణుతీర్థము, యీఐదు తీర్థములను చుట్టుకొనిన కైరవణి అను సరస్సు, భృగు, అత్రి, మరీచి, మార్కండేయుడు, సుమతి సప్తరోముడు, జాలిమొదలగు సప్త మహర్షులు తపము చేసిన స్థలము బృందారణ్యక్షేత్రము, పెరియాళ్వారు, తిరుమళిశైయాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గనసతుల్కు-ఇయ్యది చెన్నపట్టణము (మదరాసు)లో నున్న సెంట్రల్ స్టేషనుకు దక్షిణమున 3 మైళ్ళదూరములో మున్ను, ఎగుంబూరు స్టేషనుకు ఆగ్నేయమున 2 - మైళ్ళదూరములోను నున్నది. ఈ చెన్నపట్టణము చెన్నరాజధానికి ముఖ్యపట్టణము, ఇయ్యది గొప్పపట్టణ మగుటచేత సర్వ సౌకర్యములు గలిగియున్నది. చూడవలసిన వినోదములన్నియు ఈపట్టణమున యున్నది. ప్రతివారును తప్పక చూడవలయును. ఈ క్షేత్రమునకు దక్షిణమున 2 మైళ్ళదూరములో పురాణస్థలమగు (తిరుమయిలై) మయిలాపురియందు కేశవపెరుమాళ్ళు, మాధవపెరుమారుమాళ్లు సన్నధులు వున్నవి.



## 90. తిరునీర్మలై-ఘండారణ్యక్షేత్రము.

ప్రభావము:-నీర్వణ్ణర్, నీలముగిల్వణ్ణర్, రంగనాథుడు, అణిమామలర్ మంగనాంచారు, తోయగిరివిమానము, మణిక

ర్ణిక విమానము, దక్షిణతిరుముఖమండలము, మాణిక్య శయనము, తొండమానుచక్రవర్తికి, భృగుమహర్షికి, మార్కండేయునకు ప్రత్యక్షము, పూదత్తాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

శాంతనరసింహులు, ద్విభుజం వీత్తిరుందతిరుక్కోలము, తూర్పు తిరుముఖమండలం, శాంతవిమానం, ప్రహ్లాదునకు ప్రత్యక్షము. ఉలగళన్ద పెరుమాళ్, బ్రహ్మాండ విమానము, శుద్ధ పుష్కరిణీ, రుద్రునికి ప్రత్యక్షము. చక్రవర్తి తిరుమగనార్, పుష్పక విమానము, స్వర్ణపుష్కరిణి.

మార్గవసతులు:— ఇయ్యది చెన్న పట్టణమునకు 12 మైళ్ళదూరములోనున్న పల్లావరంస్టేషనుకు దక్షిణమునకి 2½ మైలుదూరములోనున్నది, బండ్లువున్నవి, సత్రమున్నది, భోజనశాలలులేవు, సన్నిధియందు ప్రసాదము దొరుకును. మదరాసునుండి మోటార్ బస్సులరాకపోకలువున్నవి.

## 91. తిరువిడవెన్దై - ఇడవెన్దై.

ప్రభావము:—నిత్యకల్యాణులు, కోమలవల్లి తాయార్, కల్యాణ విమానము, కల్యాణతీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్నతిరుక్కోలము, మార్కండేయునకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—వండలూరు స్టేషనుకు ఆగ్నేయమున 10- మైళ్ళదూరములోనున్న కోవళమునకు దక్షిణము కెనాల్ మార్గమ గా 2- మైళ్ళదూరములో నున్నది. చిన్నగ్రామమగుటచేత సత్రములుగాని, భోజనశాలలు గాని లేవు. సన్నిధియందును ప్రసాదము చిక్కుటయరుదు. చిత్రినెల శ్రవణ నక్షత్రము సమాప్తిగా 10 దినములు బ్రహ్మోత్సవము జరుగును, అయిదవదినం రాత్రి గరుడోత్సవము. ఈక్షేత్రమునకు దక్షిణమున 6- మైళ్ళ దూరము లో మహాబలిపురము (తిరుక్కడల్ మల్లై) యున్నది.

# 92. తిరుక్కడల్మల్లై - మహాబలిపురము.

ప్రభావము:— స్థలశయనత్తురైవర్, నిలమంగై నాచ్చియార్, గగనాకృతి విమానము, గరుడనది తూర్పుతిరుముఖ మండలము, భుజంగశయనము, పుండరీకమహర్షికి ప్రత్యక్షము, పూదత్తాళ్వారు, తిరుమళిశైయాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:-చెంగల్పట్టు స్టేషనుకు అగ్నేయమున 9 మైళ్ళ దూరములో నున్న తిరుక్కళుక్కుండ్రము (పక్షితీర్థము) నకు తూర్పునరాజబాట మార్గముగా 9 మైళ్ళదూరములో నున్నది. చెన్నపట్టణమునకు దక్షిణమున 7 మైళ్ళదూరములోనున్న పాపాకు చావడినుండి కెనాల్ మార్గముగా పడవలమీదుగా తిరువెడందకున్ను, మహాబలిపురమునకున్ను పోవచ్చును. కెనాల్ మార్గముగ పాపాకు చావడి నుండి 28 మైళ్ళదూరములో నున్నది. ఇదిచిన్న

గ్రామమగుటచేత సత్రములు భోజనశాలలు లేవు, సన్నిధియందు ప్రసాదము చిక్కుట దుర్లభము. ఇయ్యది సముద్రతీరము నందున్నది.

పల్లవరాజగు నరసింహవర్మ (మహామల్లుడు)చే గట్టింప బడినందు వలన మహామల్లపురమని ప్రసిద్ధిజెందినది ఇప్పటికి మహాబలిపురమని వాడుకలో నున్నది. ఈ రాజుకాలమందు శిల్పులచేత చిన్నకొండలను చెక్కించి అయిదు రథములుగా చేయించి యుండియున్న పంచపాండవుల రథములున్ను, అర్జును డుతపస్సు చేసినమంటపమును చూడడమునకు వినోదముగానుం డును. చిత్రినెల విశాఖా నక్షత్రమునాడు అవసానముగా 10 రోజులు బ్రహ్మోత్సవము జరుగును. మాశి యమావాస్య నాడు సముద్రస్నానము యిచ్చుట విశేషము.

## 93. తిన్ననూర్ - తిరునింద్రవూర్

ప్రభావము:—భక్తవత్సలుడు, పత్తరావి ప్పెరుమాళ్ళు, ఎన్నైపెత్తతాయార్, శ్రీనివాసవిమానము, వరుణపుష్కరిణి, వృద్ధక్షీరనది, తూర్పుతిరుముఖ మండలము, నిన్నతిరుక్కోలము, వరుణునకు ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది తిన్ననూర్ స్టేషనుకు దక్షిణమున రాజబాట మార్గముగా 1 మైలు దూరములో నున్నది, బండ్లువున్నవి. సత్రమున్నది, భోజనశాలలున్నవి, సన్నిధియందు ప్రసాదములు చిక్కును. పంగునినెలయందు శ్రవణ నక్షత్రము అవ

సానముగా 10 దినములు బ్రహ్మోత్సవముజరుగును, మూ
డవ దినం వుదయం గరుడోత్సవము జరుగుచున్నది.

---

# 94. తిరువెవ్వుళ్ - (తిరువళ్ళూర్)

---

ప్రభావము:—వీరరాఘవ పెరుమాళ్, కనకవల్లి తా
యారు, విజయకోటి విమానము, హృత్తాప నాశ తీర్థము,
తూర్పు తిరుముఖమండలము, భుజంగశయనము, ఈహారణ్యక్షే
త్రము, పారిహోత్రునకు ప్రత్యక్షము, ఈహారణ్యావనము, తిరు
మంగయాళ్వారు మంగళాశాసనము

మార్గవసతులు:—ఇయ్యది తిరువళ్ళూరు స్టేషనుకు వుత్త
రమున రాజబాట మార్గముగా 2 మైళ్ళ దూరములో నున్నది.
సత్రములు, భోజనశాలలువున్నవి, బండ్లు, ట్రాంబండ్లువున్నవి, స
న్నిధియందుప్రసాదము దిక్కును. చిత్రినెల పునర్వసు నక్షత్రము
నాడు మొదలు 10 దినములు బ్రహ్మోత్సమును, తై మాసము
నందు పూర్వాభాద్ర నక్షత్రమురోజు అవసానముగా 10 దినము
లు బ్రహ్మోత్సవము జరుగుచున్నది. ప్రతి యమావాస్యనాడు ప్రార్థ
నలు చెల్లించుటకు అసంఖ్యాతములైన జనులువచ్చుదురు. ఆని
యమావాశ్యనుండి, తై యమావాస్యనుండి మూడు దినములు
తెప్పోత్సవము జరుగుచున్నది ఈదివ్య క్షేత్రమునకు దక్షిణ
మున రాజబాటమార్గముగా 11 మైళ్ళదూ: మున శ్రీరామాను
జులవారి అవతారస్థలమైన శ్రీపెరంబూదూరను పుణ్యస్థలము
వున్నది.

# 95. తిరుఘటికై (ఘటికాచలం) చోళశింగపురము.

ప్రభావము:—యోగనరసింహులు, అమృతవల్లినాచ్చి మార్, శింగకోష్ఠ విమానము, తూర్పు తిరుముఖమండలము, పిత్రిరుద్ధ తిరుకోనేలము, అమృతతీర్థము, శిరియతిరుడిడికి (అంజనేయులకు) ప్రత్యక్షము, తక్కాన్ అక్కారక్కని పెరుమాళ్ళు, తక్కాన్ కుళము, పేయాళ్వారు, నమ్మాళ్వారు, తిరుమంగ యాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది చెన్నపట్టణమునకు వాయవ్యమున 40 మైళ్ళదూరములో నున్న చోళింగపురం స్టేషనుకు వాయవ్యమున రాజబాటమార్గముగా 8 మైళ్ళదూరములోనున్నది. బంగ్లా, సత్రములు, భోజనశాలలు వున్నవి. ఇచ్చటికి వ్యాధిగ్రస్తులు, పైశాచగ్రహబాధలచే పీడింపబడువారును యిచ్చటికి సదాకాలము వచ్చుచునే యుందురు. తీరనివ్యాధులు మాయమయిపోవును. పైశాచములు పాఱిపోవును.

నరసింహస్వామివద్ద సర్వస్వతంత్రములుపొంది ఆంజనేయులు తనిగాయుండు చిన్నకొండయందు వేంచేసియున్నారు. వీరు వ్యాధిగ్రస్తుల స్వప్నములయందు వ్యాధులయొక్క గుణమును, వాటికి పరిహారములును తెల్పెదరు. చోళింగపురం వూరికి $1\frac{1}{2}$ మైలు దూరములో ఈకొండయున్నది.

తొండదేశపు తిరుపతులు సమాప్తము.

---

ఉత్తరదేశపు తిరుపతులు 12.

# 96. తిరువేంగడం - తిరుపతి

# వెంకటాచలం.



ప్రభావము:—వృషభాద్రి, చిన్తామణి, అంజనాచలం, శేషాచలం, జ్ఞానాద్రి, వైకుంఠగిరి, గరుడాద్రి, శ్రీనివాసగిరి, కల్యాణగిరి, నరసింహగిరి, పుష్కరశైలం, వరాహపర్వతం, వరాహక్షేత్రం, తిరువేంగడత్తాన్, ఆలర్మేల్మంగ తాయారు, పద్మావతి, ఆనందనిలయమానము, స్వామిపుష్కరిణి, కోనేరి తీర్థము, కుమారతీర్థము, తుంబురుతీర్థము, నారదతీర్థము, ఆకాశగంగ, పాపనాశతీర్థము, కృష్ణతీర్థము, చక్రతీర్థము, పాండవతీర్థము, కపిలతీర్థము, ఇంద్రతీర్థము, తొట్టితీర్థము, తూర్పుతిరుముఖ మండలము, నిన్నతిరుకోటలను, బ్రహ్మకు, ఇంద్రునకు,దశరథచక్రవర్తికి, తొండమాన్ చక్రవర్తికి, షణ్ముఖునికి, ప్రత్యక్షము. పొయ్‌గైయాళ్వారు, భూదత్తాళ్వారు, పేయాళ్వారు తిరుమళిశైయాళ్వారు, కులశేఖరాళ్వారు, తిరుప్పాణాళ్వారు, నమ్మాళ్వారు,తిరుమంగయాళ్వారు, పెరియాళ్వారు, మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది రేణిగుంటస్టేషనుకు పడమట 6 మైళ్ళదూరములోనున్న తిరుపతిస్టేషనుకు 2 ఫర్లాంగుల దూరములోనున్నది. ఊరికిన్ని కొండ అడివారమునకున్ను 1 మైలు

దూరమువున్నది. కొండల మధ్యలోనున్న తిరుపతిక్షేత్రము అడి వారమునుండి 6 మైళ్ళదూరములోనున్నది. ఊరికి వుత్తరమున 1 మైలుదూరములో ఆళ్వారు తీర్థమువున్నది. ప్రయాణీకులు ఆళ్వారు తీర్థములోస్నానముచేసి అచ్చటనుండి అడ్డదారి మార్గముగా 1 మైలుదూరములోనున్న కొండయడివారమునకు వచ్చుచున్నారు. ఇచ్చటనుండియే పర్వతారోహణముచేయుదురు. మొదటి పర్వతము (గాలిగోపురము కొండ) న్ను, ఆరవ కొండ (మోకాళ్ళపర్వతము) న్ను యెక్కుటకష్టము. చంద్రగిరినుండి మంగాపురంమార్గముగా 5 మైళ్ళదూరములో ఈ క్షేత్రమువున్నది. ఈమార్గమున కొండయెక్కుడము 1 మైలు ఈ మార్గముగాబండ్లు, ఏనుగలు, సామానులు కొండమీదనున్న తిరుపతికి వచ్చుచున్నవి. దుష్టమృగసంచారముగల దారిగానుండుటవల్లనున్ను జలసౌకర్యములేని కారణముచేతను జనులు ఈ మార్గముగా ప్రయాణము చేయరు.

ఈ దివ్యదేశము దిగువ తిరుపతియనియు, ఎగువ తిరుపతి (కొండమీదనున్న తిరుపతి) యని రెండుభాగములుగానున్నవి, దిగువ తిరుపతియందు గోవిందరాజులసన్నిది, శ్రీరాముల సన్నిధి, ఆళ్వారుతీర్థము, నరసింహతీర్థము, శ్రీరామతీర్థము మొదలగు తీర్థములును, కొన్ని మఠములున్ను, సత్రములున్ను భోజనశాలలును కాఫీక్లబ్బులును మొదలగునవియున్నవి. ఎగువ తిరుపతి యందు తిరువేంగడముడయాన్ సన్నిధియు, రామానుజకూటములును, సత్రములును, భోజనశాలలును, కాఫీక్లబ్బులును, వున్నవి. సన్నిధియందు ప్రసాదముదొరుకును. కొండయెక్కుటకు డోలీలును కూలివాండ్రునుయున్నారు, మార్గమధ్యమున విశ్ర

మించుటకు యచ్చటచ్చట మంరపములును చలిపందళ్ళున్ను యున్నవి. మార్గమందు ఎలక్ట్రిక్ దీపములు రాత్రులయందు ప్రకాశించుచుండును. తిరువేంగడముడయాన్ సన్నిధికి ఆగ్నేయ మూలయందు అనంతళ్వారు త్రవ్వినచెఱువువున్నది. ఆ చెరువు నుండియే తిరుపతికి గొట్టముల మార్గముగా మంచినీరు వచ్చు చున్నది.

బ్రహ్మోత్సవము, పెరటాశినెల శ్రవణ నక్షత్రము రోజున తీర్థోత్సవము జరుగును.

# 97. శింగవేళ్ కుంద్రం - అహోబిలము.

ప్రభావము:—నరసింహులు, లక్ష్మీనాంచియారు, కురుగై విమానము, ఇంద్రతీర్థము, నరశింగతీర్థము, పాపనాశతీర్థము, తూర్పు తిరుముఖమండలము, వీత్తిరుందతిరుక్కోలము, హిరణ్యునిసంహారించి ప్రహ్లాదుని రక్షించినవారు. నమ్మాళ్వారు, తిరుమంగ యాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—కడపకు దక్షిణమున 24 మైళ్ళదూరములో నున్న ఎఱ్ఱగుంట స్టేషనుకు వుత్తరమున 8 మైళ్ళ దూరములోనున్న ప్రొద్దుటూరును, 18 మైళ్ళదూరములో శాక్కల్ మూరుకు వుత్తరమున 14 మైళ్ళదూరములో యీ దివ్యదేశమువున్నది. నంద్యాల్ స్టేషనుకు దక్షిణముగ రుద్రావరము మార్గముగా 27 మైళ్ళదూరములో ఈ క్షేత్రమున్నది కడపా స్టేషనునుండి ప్రొద్దుటూరు మార్గముగను ఈ దివ్యదేశ

మునకు పోవచ్చును. మోటారు బస్సుల రాకపోకలువున్నవి, బండ్లువున్నవి సన్నిధితప్ప వేరేచోటులేదు. సన్నిధియందు ప్రసాదము చిక్కదు. జలముకూడా దొరుకుటకష్టము. ఈ క్షేత్రమందున్న నరసింహస్వామి తొమ్మిదిమూర్తులుగా వేంచేసియుండుట వల్లనవనరసింహమని చెప్పెదరు. 1 లక్ష్మీనరసింహం, (దిగువ అహోబిలం) 2 సత్తిరాంత నరసింహం, 3 యోగనరసింహం, (ఇవి తేరువీధి మార్గములో $1\frac{1}{2}$ మైలు దూరములో నున్నవి.) 4 కారంగి నరసింహం, (పైయహోబిలము పోవుమార్గములో నున్నది,) 5 ఉగ్రనరసింహం (ఎగువ అహోబిలము) 6 భార్గవ నరసింహం (గరుడాద్రియందున్నది). 7 పర్మలిధి నరసింహం (వేదాద్రియందున్నది) 8 వరాహ నరసింహం 9 ప్రహ్లాదనరసింహం (ఇవి గంధాద్రియందున్నవి). అహోబిల పర్వతముచుట్టు అనేక సన్నధులును తీర్థములునువున్నవి.

---

# 98. ద్వారక.

ప్రభావము:—కల్యాణనారాయణులు, కల్యాణనాచ్చియారు, అష్టమహర్షులు, హేమకూటవిమానము, గోమతితీర్థము, పశ్చిమతిరుముఖమండలము, వీత్తిరుంద తిరుక్కోలము ద్రౌపదికి ప్రత్యక్షము, నమ్మాళ్వారు, పెరియాళ్వారు, తిరుమంగయాళ్వారు, ఆండాళు మంగళాశాసనము.

మార్గవసతులు:—బొంబాయినుండి సముద్రమార్గముగా 180 మైళ్ళదూరమునవున్నది. ఇదియే మిక్కిలి సౌఖ్యమైన

మార్గము ఈ మార్గముగా స్టీమరు (పోగయోడ) యందు ప్రయాణము చేయవలయును. రాత్రి 8 గంటలకు బైలుదేరు స్టీమరు మరునాడు పగలు 12 గంటలకు ద్వారకనుచేరును. బొంబాయినుండి రైలుబండ్ల మార్గముగా 550 మైళ్ళదూరములో ఈ ద్వారకయున్నది. ఈ మార్గముగా ప్రయాణము 2½ దినములుపట్టును బొంబాయినుండి బరోడా మార్గముగా అమదాబాద్ జంక్షన్ చేరి అచ్చటనుండి ఆగ్నేయముగా పోవు రైలుమార్గముగా వీరంగం, జటెల్‌సార్, జంగ్షనులదోవగా పోయి పోర్‌బందరు చేరవలెను. పోర్‌బందరు అనునదికుచేల పట్టణము (సుధామపురి). కుచేలస్వామి సన్నిధివున్నది. ఇచ్చటదిగి యుండుటకు వసతులున్నవి. ఇచ్చటనుండి సముద్ర తీరమార్గము గానడిచి యైనను, స్టీమరులోనైనను పోవచ్చును. సుధామపురి నుండి ద్వారకకు 55 మైళ్లదూరమున్నది. ఇచ్చటనుండి నడిచి పోవుటకు 3 రోజులుపట్టును, జలముదొరకుటకష్టము. మార్గ మధ్యమున మజిలీచేయుటకు అచ్చటచ్చట సత్రములున్నవి. ద్వారకకు ¼ మైలుదూరములో వుత్తరాది రామానుజకూట మున్నది. వైష్ణవులు దిగియుండుటకు సౌఖ్యమైనచోటిదియే.

---

# 99. అయోధ్య.



ప్రభావము:—చక్రవర్తితిరుమగన్, రఘునాయకులు, సీతాపిరాట్టి, పుష్కలవిమానము, పరమపద సత్యపుష్కరిణి, సరయూనది, ఉత్తర తిరుముఖమండలము, పీత్తురుంద తిరుకోట్ల

ము, భరతాళ్వారుకు దేవతలకు మునులకు ప్రత్యక్షము. నమ్మాళ్వారు కులశేఖరాళ్వారు పెరియాళ్వారు తిరుమంగయాళ్వారు మంగళా శాసనము.

మార్గవసతులు:—ఇయ్యది కాశీకి వాయవ్యమున 128 మైళ్ళదూరములోను, ప్రయాగకు వుత్తరమున 95 మైళ్ళదూరములోను, అయోధ్య స్టేషనుకు దక్షిణమున 2 మైళ్ళదూరమున సరయూనది తీరమునందున్నది. ఫైజాబాడ్ (Fyzabad) స్టేషనుకు వుత్తరమున 6 మైళ్ళదూరములో ఈ దివ్యదేశమున్నది. నాట్టుకోట వారిసత్రమును, అనేక ధర్మశాలలునువున్నవి. నాట్టుకోటవారి సత్రమందు దక్షిణాది బ్రాహ్మణులుమాత్రమే దిగవచ్చును, తతిమవారు ధర్మశాలకే పోవలెను. ఇచ్చట హనుమంతుల సన్నిధివున్నది. వీరు వరప్రసాదియగుటచేత అనేకులు ఈ సన్నిధియందు రామాయణము పారాయణముజేసెదరు. ఇచ్చట వానర (కోతులు) సమూహము విశేషము. ఇవి యాత్రికులను బెదరించివారి చేతులనున్న తినుభండములను తీసుకొని పాఱిపోవును. సన్నిధికి పోవునప్పుడు మిక్కిలి జాగ్రతగా పోవలయును. యాత్రికులు సరయూనది యందుస్నానముచేసి శ్రీరాముల వారిజన్మస్థానమును హనుమంతుని (శిరియ తిరువడి) సేవించవలయును, తిరువల్లిక్కేణిలోనుండిన శ్రీమాన్ యోగి పార్థసారథి అయ్యంగార్ స్వామిగారు సరయూనది తీరమునందు శ్రీరాములవారిసన్నిధి కట్టియున్నారు. ఈసన్నిధికి సమీపమునసుండు అమ్మాజీ మందిరమున బసచేయుటయే చాలా వుత్తమము. ఇచ్చట సర్వసౌకర్యములువున్నవి.

ఈ దివ్య దేశము మోక్షదాయకములైన సప్తపురులలో ప్రధానమైనది. పురాతన నాగరీకముగలిగిన పట్టణము. ఇయ్యది పూర్వము 96 మైళ్ళ విస్తీర్ణము గలిగియుండెను. సూర్యవంశపు రాజులు పరిపాలించుచుండిన ఈ నగరము జీర్ణమగుటనందున 2002 సంవత్సరములకుమున్ను విక్రమాదిత్య మహారాజుచే మరలపురనిర్మాణము గావింపబడెను పిదప శ్రీరాముల జన్మస్థానమునుస్వర్గద్వారములున్నుయిడగొట్టి యచ్చట ఔరంగజీబు మసీదు కట్టెను. ఈ మసీదుకుముందుప్రక్కన శ్రీరాములను చిన్నసన్నిధి యొకటి కట్టించి శ్రీరాములవారి జన్మస్థానముయొక్క పేరు పోకుండునట్లు గావించి యిప్పటికిని ఆరాధించుచున్నారు. ఇప్పటికిని ఈ నగరవాసులు శ్రీరాములవారిని విగ్రహరూపముతో నారాధించుచున్నారు. సరయూనదియందు తాబేళ్ళు విశేషముగా నుండి నప్పటికిన్ని స్నానముచేయువారికి యే తొందరనుజేయదు. ఈ నగరమునకు 6 మైళ్ళదూరములోనున్న పైజాబాదునకు వుత్తరమున 1 మైలుదూరములో సరయూనదియందు కుబ్దార్ ఘాట్ అను స్నానఘట్టమున్నది. ఇచ్చట నొకగొప్ప అశోక వృక్షమున్నది. ఈ కుబ్దార్ ఘాటుయందు శ్రీరాములవారు అదృశ్యులై పోయినట్లుగాచెప్పెదరు. యాత్రికులు విశేషముగా యిచ్చటికి వచ్చిస్నానముచేసెదరు. ఈ క్షేత్రమందు శ్రీరామనవమి మహోత్సవము అతివైభవముగా జరిపెదరు. సుమారు 6 లక్షల జనులుకూడెదరు.

శ్రీరాములు జన్మించిన గర్భస్థానము, అయోధ్యాపీఠము, రత్నమంటపము, కనకమంటపము, ధర్మస్థానము, అగ్నిగుండము, వుద్యానవనం, అగస్త్యాశ్రమం, వసిష్ఠస్థానం, హనుమంతగుం

డం, సరసేంద్రగుండం, సీతాకూపం, చక్రతీర్థం, ఋణవిమోచన తీర్థం, వాల్మీకి తీర్థం, నారాయణ గుండం, స్వర్ణగాములు మొదలగునవి ముఖ్యముగా సేవించవలయును.



# 100 నైమిశారణ్యం.



ప్రభావము:—దేవరాజ పెరుమాళ్ళు శ్రీహరిలక్ష్మి పుండరీకవల్లి తాయారు, శ్రీహరి విమానము, దివ్యవిశ్రాంతి తీర్థము, తూర్పుశిరుముఖమండలము, నిన్న తిరుక్కోలము, దేవర్షులకు, ఇంద్రాదులకు, సుధర్మునకు, ప్రత్యక్షము. తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:-ఇయ్యది (Lucknow-Balamu) లక్నో-బలాము జంక్షనులకు మధ్యలోనున్న (Sandila) శాండిలా స్టేషనుకు వుత్తరమున 20 మైళ్ళదూరములోనున్నది. మిషిరి (సీతాపూర్) స్టేషనుకు 12 మైళ్ళదూరములో యీ క్షేత్రమున్నది. బదరికాశ్రమమునుండి మరలి వచ్చువారు కత్గోడం (Kathgodam) స్టేషనువద్ద రైలుమెక్కి లాల్కువా (Lalkuva) బారియిల్లి (Bareilly) సహాజాన్‌పూర్ (Sahajanpur) సీతాపూర్ (Sitapur) మార్గముగావచ్చి సితాపూర్ బలాము (Balamu) జంక్షనులకు మధ్యలోనున్న (Nimisar) నైమిశారణ్యం స్టేషనులోదిగి పడమట 2 మైళ్ళదూరముపోయిన యీ క్షేత్రముఁజేరెదరు. బంగ్లా, ధర్మశాలలువున్నవి ఇచ్చట

శ్రీవానమామలై స్వామి మఠమును, రామానుజ కూటమును వున్నవి. పెరుమాళ్లు వరరూపిగా సేవసేయించుచున్నారు. ఈ వనమునకే తిరువారాధనము జరుపుచున్నారు. ఇచ్చట సూత పౌరాణికుల మఠమున్నది. ఈ మఠమునందు తాళపత్రగ్రంథ ములు అడుకులు అడుకులుగా నున్నవి. ఈ క్షేత్రమందు వ్యాసులకు, శుకులకు, సూతపౌరాణికులకు తనితనిగా సన్నధులు గట్టియున్నారు.

శ్రీరామనవమినాడు అయోధ్య, లక్ష్మణపురినుండి యాత్ర వాసులనేకులను పైదివ్యదేశపు సేవకులచేత తగుమైన బందోబ స్తుతో యీనైమిశారణ్యములోపల తీసుకొనిపోయెదరు. అడవి మనుష్యులు విశేషముగా యుండుటవలన ఒంటరిగ పోకూడదు.

## 101. ఉత్తర మధుర.

ప్రభావము:—గోవర్ధన క్షేత్రము, గోవర్ధనేశుడు, సత్య భామ, గోవర్ధన విమానము, గోవర్ధన తీర్థము, ఇంద్ర తీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్నతిరుకోలము, ఇంద్రాది దేవ తలకు ప్రత్యక్షము, నమ్మాళ్వారు, పెరియాళ్వారు, తిరుమంగ యాళ్వారు, ఆండాళు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది డెల్లీ (Delhi) కి దక్షిణమున 80 మైళ్ళదూరములోనున్న (Muttra) మధురా స్టేషనుకు సమీ పముగా యమునానదీ తీరముననున్నది. ఈ క్షేత్రమునకు వుత్త

మున 6 మైళ్ళదూరములో బృందావనమును, తూర్పున 4 మైళ్ళ, దూరములో గోకులమును, దక్షిణమున 9 మైళ్ళదూరములో గోవర్ధనగిరియునువున్నవి. ఇచ్చట ధర్మశాలలు అధికముగాయు న్నవి. సర్వసౌకర్యములువున్నవి మోక్షదాయకమైన నగరము లలో నిది రెండవది.

విశ్రాంత్ ఘాట్ ఇయ్యది ఈ క్షేత్రమున ముఖ్యమయిన స్నానఘట్టము, ఇచ్చట నొక చిన్న సుందరమైన సన్నధిని కట్టి గోపుర శిఖరమందు అనేక ఘంటల నమర్చియున్నారు. ప్రతిదిన ము సాయంత్రం 6 గంటలకు ఇచ్చటనుండి యమూనానదికి దీపారాధన జరిపించెదరు. దీనిని సేవించుటకు సాయంసమయ మునందు వందలకొలది జనులు యిచ్చటికివచ్చెదరు.

కంసరాజుకోట, కేశవాలయము, పోత్రాఘుంట్, బందే ఖానా మొదలగునవి సేవించవలసినది.

## బృందావనం (బృందాభన్).

ప్రభావము:—రాధావల్లభుడు, రాధాదేవి, వస్త్రాపహ రణ తీర్థము, యమునానది, తూర్పు తిరుముఖమండలము, చిన్న తిరుకోటలము, రాధాదేవికి ప్రత్యక్షము, గోవిందదేవ్, గోపీ నాథ్, మదన్ మోహానుల సన్నధులుయున్నవి. ఈ సన్నధి కాళంగి మర్ధనఘట్టమునకు సమీపము.

శ్రీ కృష్ణమూర్తి మధురాపురి యందవతరించి గోకులమందు (తిరువాయ్‌పాడి) పెరిగినపిదప యాదవులందరును బృందావన మునందు వాసముచేయుచుండిరి. ఇచ్చట శ్రీకృష్ణమూర్తి లీలా వినోదములుగావించినవిషయము శ్రీ మహా భాగవతమునందు

ప్రసిద్ధి. ఇచ్చట ముఖ్యముగా సేవింపవలసినది. (1) యమునానదీ తీరముయొడ్డున 32 స్నానఘట్టములు, (2) కాళీమడుగు, (3) కడంబవృక్షము, (4) క్షీరఘాట్ (వస్త్రాపహరణ లీలను అమర్చ బడిన సూచకము), కేశీఘాట్, (6) బిల్వవనము(లక్ష్మీనివాసం) (7) మధువనం (రాధానివాసం), ఇచ్చటనున్న యనేకవిధ పక్షి జాలములును, వానర సమూహములును వేరు యితరమైన జీవవర్గములు రాత్రికాలములయందు యిచ్చట వాసముచేయ డము లేదనుట ఆశ్చర్యము (8) గోపీశ్వరమహాదేవ్ (భగవం తుని అద్భుత లీలావినోదములన అనుభవించుటకు శివుడు గోప స్త్రీ వేషముధరించి కొంత కాలము కృష్ణునితో వసించి యుండినచో టని చెప్పెదరు, (9) రంగమందిరం (గోవర్ధన రంగాచార్య స్వా ములు అమితద్రవ్యమును ఖర్చుచేసి సప్తప్రాకారములతో కట్టి యున్న రంగమన్నార్ సన్నిధి. ఈ సన్నిధియందు ద్రవిడదేశ శ్రీ వైష్ణవ సంప్రదాయాను సారముగా పాంచరాత్రాగా మోక్త ముగా తిరువారాధనముచేసి ఇయల్ శాత్తు సేవ జరిపి తీర్థప్రసాద ములను విని యోగించెదరు. ఇచ్చట మధ్యాహ్నములయందు, రాత్రివేళలయందు జాతిభేదములను పాటించక యేసమయమున ను అలంకారముగా ప్రసాదములను దేశాంతరులకు యిచ్చెదరు. ఈ రంగమన్నారు సనిధి (రంగమండిరం) బృందావనం (బృందా భన్) స్టేషనుకు తూర్పు ½ మైలుదూరములోనున్నది. మధు రాపురమునకు ఉత్తరమున 6 మైళ్ళదూరములో యమునానదీ తీరమునకు పైగానున్నది. బండ్లుగలవు, ఈ సన్నిధియందు బస చేయుటకు మిగుల వసతిగాయున్నది.

గోవర్ధనం - గోవర్ధనగిరి.

ప్రభావము:—గోకులనాథుడు, శ్రీహరినాథుడు, శ్రీరాధాదేవి, పర్వతవిమానము, మానసగంగ, బ్రహ్మతీర్థము, రాధాతీర్థము, కాళింగమడుగు, గోవర్ధనపర్వతం, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుక్కోలము, యాదవులకు, ఇంద్రునకు ప్రత్యక్షము.

మార్గవసతులు:—ఉత్తరమథురాపురికి 10 మైళ్ళదూరములోనున్నది, ఈగోవర్ధనగిరికి పోయిరావడమునకు బండ్లను మధురాపురియందే యమర్చుకొనవలయును.

ఇంద్రునికి చేయుచుండిన పూజను శ్రీకృష్ణుని హితోపదేశమువలన యాదవులు యాపూజను గోవర్ధనగిరికిచేసిరి. అందుచే దేవేంద్రుడు మిగుల కోపముగలిగి సప్తమేఘములను పురికొలిపి యేడహోరాత్రములు ప్రచండముగా వర్షించునట్లు చేయగా యాదవవులను గోవులను రక్షించుటకు గోవర్ధనగిరిని గొడుగుగానెత్తి, వారిని సంరక్షించెను. ఈ పర్వతముయొక్క చుట్టుకొలత 10 మైళ్ళు యాత్రికులు యీగిరిని ప్రదక్షిణము జేసెదరు. ప్రదక్షిణమార్గమందు విశ్రమించుటకు మంతపములు యేర్పఱచియున్నారు.



# 102. తిరువాయిప్పాడి - గోకులము.



ప్రభావము:—నవమోహనకృష్ణుడు, రుక్మిణీదేవి, సత్యభామనాచ్చియారు, హేమకూట విమానము, యమునానది, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుక్కోలము, నందగోపాలు

నకు ప్రత్యక్షము, కులశేఖరాళ్వారు, పెరియా ళ్వారు, ఆండాలు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది మధురా (Muttra) స్టేష నుకు దక్షిణమున రాజబాటమార్గముగా 4 మైళ్ళ దూరములో యమునానదీ తీరమున నొక గ్రామముగానున్నది, శ్రీకృష్ణ మూర్తి పెరిగినస్థలము, బలరాములవతరించిన స్థలము. ఈ క్షేత్రము సర్వసౌకర్యమును గలిగియున్నది. ప్రతి ఆదివారము రోజున జలక్రీడ, రాసక్రీడ వుత్సవములు జరిపెదరు. ఇచ్చట మధురనాథుని సన్నిధి, శ్రీకృష్ణుని సన్నిధి బలరాముని సన్నిధి మొదలగునవి వున్నవి. క్షీరసాగరబలభద్రగుండమను తెప్పగుంట వనమునకు 6 మైళ్ళ దూరములోనున్నది.



## 103. తిరుగ్గంగై క్కొ - రైకండం - కతినగర్ - దేవప్రయాగ.

ప్రభావము:—నీలమేఘ పెరుమాళ్లు, పురుషోత్తములు, పుండరీకవల్లి నాచ్చియారు, మంగళవిమానము, మంగళతీర్థము, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, భరద్వాజ మహర్షికి ప్రత్యక్షము, పెరియాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—హరిద్వారమునుండి హిమవద్గిరికి పైన 58 మైళ్ళదూరములోనున్నది. అలహాబాదు స్టేషనులో

దిగి హిమవద్గిరికి పోవుమార్గములో లక్ష్మణ సన్నిధికి సమీప మునయున్నది.

మార్గవసతులు:—హరిద్వారమునుండి 7 వ మైలునందు సత్యనారాయణం (ఇచ్చట సత్యనారాయణుని సన్నిధియు, గరుడుని సన్నిధియు, మూడుతీర్థములు యున్నవి). 15 వ మైలునందు హృషీకేశం (ఇచ్చట హృషీకేశుడు, శీతా రామభర త సన్నధులున్నవి. ఇచ్చట కాళీకంలీవాలా ధర్మశాలయను పెద్ద ధర్మశాలయును, తపాలా తంతిఆఫీసును, పెద్ద అంగళ్ళునువున్నవి. ఇచ్చటనుండియే కొండ యెక్కవలయును, బండ్లు మొదలగునవి యిచ్చటనే నమర్చుకొనవలయును. ఇచ్చటనుండి హిమవద్గిరిని చక్కగా దర్శింపవచ్చును. పై చెప్పిన ధర్మశాలయందు ప్రతిరోజును 2,000 సాధువులకు ఆహారాదులు యిచ్చెదరు. యాత్రికులు తమ సామానులనన్నిటిని ధర్మశాలాధికారివద్ద నొప్పగించి పోవచ్చును. తప్పిపోవునేమో యనుసందేహము వుంచుకోవలసినదిలేదు. తిరిగివచ్చునపుడు వారిచ్చిన రసీదును యిచ్చి తమ తమ సామానులను తీసుకొనవచ్చును. అట్లు మరల తీసుకొనుటకు తప్పి పోయినయెడల వారా సామానులను ఆరు నెలలవరకు చూచి పిదప సొంతదారుల విలాసమునకు పంపివేయుదురు. హరిద్వారమునుండి హృషీకేశమువరకు మోటారు బస్సుల రాకపోకలుయున్నవి.

(హృషీకేశమునకు 2 మైళ్ళు), హరిద్వారమునకు 17 వ మైలునందు తపోవనము, 18 వ మైలునందు లక్ష్మణజూలా (జూలా అనగా ఉయ్యాల, చిన్ననదులను దాటుటకు కట్టించి యుండెడు వంతెన ఉయ్యాలవలె ఆడుచుండును. ఇచ్చట లక్ష్మ

ణుని సన్నిధియుండుటవలన లక్ష్మణ జూలాయను పేరు గలిగెను. లక్ష్మీనారాయణుడు, శత్రుఘ్నా శ్వారుసన్నధులుయున్నవి) 20½ మైలునందు గరుడచట్టి, 26 వ మైలునందు మోహానచట్టి, 27 మైలునందు శోడాబిజిలీ, 29 వ మైలునందు బడాబిజిలీ, 30 వ మైలునందు బందరుచట్టి, 38 వ మైలునందు మహాదేవచట్టి, 42 వ మైలునందు రాంచట్టి, 49 వ మైలునందు వ్యాసఘాట్ (వ్యాసుల ఆశ్రమము), 51 వ మైలునందు శాలూరీ (రాములు, లక్ష్మణులు, సీతా సన్నిధి), 58 వ మైలునందు దేవప్రయాగ వున్నది.

ఈ దేవప్రయాగయే కండమెన్నుం కరివగర్. ఇయ్యది పెద్ద గ్రామముగుటచేత సర్వసౌకర్యములు గలిగియున్నది. ఇచ్చటనుండి గంగోద్రి, జంనోత్రి, ఉత్తర కాశి మొదలగు స్థలములకు పోవుటకు దారులువున్నవి.

## హరిద్వారం – మాయా.

ఆదినారాయణుడు, ఆదిలక్ష్మి, ఆనందవిమానము హరిపాద తీర్థము, గంగానది, భుజంగశయనము, దక్షిణ తిరుముఖ మండలము, దక్షప్రజాపతి నిమిత్తముగా బ్రహ్మరుద్రేంద్రాలకు ప్రత్యక్షము, శుకులు, పరీక్షిత్తు తపము సలిపిన స్థలము. దక్షప్రజాపతి యాగశాల, గంగ హిమవద్గిరి నుండి భూమియందు పడు చోటిదియే. మోక్షదాయములైన సప్తపురులలో నిదియొకటి.

మార్గవసతులు:—ఇయ్యది హరిద్వారం స్టేషనుకు 2 మైళ్ళదూరములోనున్నది. బండ్లు ధర్మశాలలువున్నవి. ఇచ్చట జలము అధికవుష్ణముగానుండుటచేత శీతభేదిమొదలగునవి వచ్చు

ను. అధికదినములు యుండకూడదు. వేసవి కాలమందు ప్రష్ణమ ధికము, భూమిమీద కాళ్ళుపెట్టి నడచుటకష్టము, మంచు కాల మందును సహింపజాలని చలిగాయుండును. ఇచ్చటికి 15 మైళ్ళ దూరములో హృషీకేశమున్నది, స్టేషనుకు సమీపముగా ధర్మ శాలయున్నది. కృష్ణగిరి కృష్ణమాచారియను మనదేశపు బ్రా హ్మణులలో కరు ఇచ్చటనున్నారు. వారి గృహమునందును దిగి యుండవచ్చును. కొండమీదకి పోవునప్పుడు నమ్మకముగా వీరి వద్ద సామానులుయుంచి పోవచ్చును, పండాహరియిండ్లయందు ను దిగవచ్చును. ఈ హరిద్వారమును గంగాద్వారమనియు, మాయాద్వారమనియుచెప్పెదరు. ఇయ్యది పరమపదమునకు పోవుటకు సోపానముగా నున్నదని ప్రసిద్ధి. హరిచరణఘాటునకు సమీపమున గంగాదేవి యాలయమున్నది. ఈయాలయ ప్రాకా రమందున్న శ్రీ విష్ణుపాదము ఈ క్షేత్రదర్శనమునకు ముఖ్యము.

# 104. తిరుప్పిరిది - నంద ప్రయాగ జ్యోతిర్ పురం.

పరిభాషము:—పరమపురుషులు, పరిమళవల్లి నాచ్చియా రు, గోవర్ధనవిమానము, ఇంద్రతీర్థము, గోవర్ధనతీర్థము, మానస సరస్సు, తూర్పు తిరుముఖమండలము, భుజంగశయనము, పా ర్వతికి ప్రత్యక్షము, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది హరిద్వారమునుండి 164 మైళ్ళదూరములోనున్న, దేవప్రయాగనుండి (కతినగర్) 106

మైళ్ళ దూరములోనున్నది. హరిద్వారమునుండి 61 మైలు వద్ద (అనగా దేవప్రయాగనుండి 3 మైళ్ళదూరములో) అంద కోటి, 65 వ మైలువద్ద రాణీభాగ్, 69 వ మైలువద్ద రాంపూర్ 73 వ మైలువద్ద బిల్ కేదార్, 77 వ మైలువద్ద శ్రీనగరం (ఇయ్యది పెద్ద గ్రామమగుటచేత సర్వసౌకర్యములు గలిగియు న్నది. ఇచ్చట, సత్యనారాయణుల, నారదుల, గరుత్మంతుల సన్నిధులువున్నవి.) 81 వ మైలునందు శుక్రతా, 87 వ మైలు నందు చట్రా, 89 వ మైలులో ఘుగ్‌గోడా, 93 వ మైలునందు గులాపురాయి, 95 వ మైలునందు రుద్రప్రయాగ మొదలగునవి యున్నవి. ఇచ్చోట మందాకినీ అళకనందా నదులు సంగమమగు చున్నవి, రుద్రమూర్తి బ్రహ్మహత్యాదోష పీడితులై ఈ స్థల మందు కొన్ని సంవత్సరములువుండిన దానివల్ల ఈ స్థలమునకు రుద్రప్రయాగయని పేరుగల్గెను. మందాకినీ నది బదరీకేదార మందున్న గోముఖమందు వుత్పత్తియగుచున్నది. ఇచ్చటనుండి బదరీకేదారమునకు మందాకినదీ తీరమార్గముగా వుత్తరదశగా మార్గమొకటియున్నది ఈ మార్గముగా అగస్త్యముని యాశ్రమం, గుప్తకాశి, త్రియుగనారాయణం మొదలగునవి దాటి గౌరీ గుండమునకు పోవచ్చును. 102 వ మైలునందు శివానంది (ఇచ్చట సత్యనారాయణుల సన్నిధి) యున్నది. 107 వ మైలునందు నాగ రాజ్, 111 వ మైలునందు షడావీపల్, (ఇచ్చట వుత్తరాది మఠ మువున్నది), 115 వ మైలునందు కర్ణాప్రయాగ (ఇచ్చట అళక నందానదియును, పిండారినదియును కలియుచున్నవి, ఇచ్చట కర్ణాక సన్నిధియును, తంతి తపాలాఫీసులునువున్నవి). 117-వ మైలునందు వుంటా, 128 వ మైలునందు నందాప్రయాగ (ఇచ్చ

టవిష్ణుగంగ, మందాకినీనది కలియుచున్నవి, నందగోపులు, యశోద, కణ్ణన్ సన్నధులువున్నవి. ఇయ్యది పెద్దగ్రామ మగుటచేత సర్వసౌకర్యములు గలిగియున్నది, గంగోత్రి, కేదారం పోయినవారు ఇచ్చటికివచ్చి బదరికాశ్రమమునకు పోవుదురు). 145 వ మైలునందు బీబల్‌కోఠీ, ఇచ్చట తపాలాఫీసు వున్నది), 149 వ మైలునందు గరుడగంగ, (ఇయ్యది గరుత్మంతులు 1100 సంవత్సరములు తపముచేయుచుండు నప్పుడు వారి నాసికమునందు వుద్భవించినందువలన గరుడ గంగయని పేరుగల్గెను) 164 వ మైలునందు జ్యోతిర్మఠం ఇదియే తిరుప్పిరుది, కుభేరుడుతపముచేసిన చోటిదియే. సర్వసౌకర్యములునువున్నవి. నరసింహాదార, బలరాముల సన్నధులువున్నవి.

166 వ మైలునందు విష్ణుప్రయాగ (ఇచ్చట అళకనందానదియును విష్ణుగంగయు కలియుచోటు, ఇచ్చట నొక కాలమునందు నారదుడు గంగయందు స్నానముచేయు చుండునపుడు విష్ణుమూర్తి విగ్రహము వీరిచేతికి దొరకగా ఇచ్చట దానిని ప్రతిష్టగావించి తపస్సుచేసుకొనుచుండెను. అందువలన విష్ణుప్రయాగయని పేరుగల్గినది, విష్ణు నారదుల సన్నధులున్నవి. 172 మైలునందు పాండికేశ్వరం (వసుదేవుని సన్నిధివున్నది), బదరికాశ్రమములోనున్న ఉత్సవ విగ్రహమును ఇచ్చటనున్న యోగ బదరీ నారాయణుని సన్నిధియందు ఆరు మాసములవరకు యుంచి ఆరాధించెదరు. చిత్రినెల చతుర్దశినాడు ఉత్సవరులను బదరికాశ్రమమునకు వేంచేపుచేసుకొని పోయి మరునాడు బదరీ నారాయణుని సన్నిధి తెరిచినపుడు పెరుమాళ్ళను ఆస్థాన

ముందు వేంచేపుచేయుదురు.) 178 వ మైలునందు హనుమాన్ చట్టీ, 188 వ మైలునందు బదరీ నారాయణంవున్నది.

# 105. బదరికాశ్రమం.

ప్రభావము:—బదరీ నారాయణులు, అరవిందవల్లి తాయారు తప్తకాంచన విమానము, తప్తకుండతీర్థము, తూర్పు తిరుముఖమండలము, వీత్తిరుంద తిరుక్కోలము, రేగుచెట్టు (బదరీ వృక్షము) క్రింద పద్మాసనాసీనుడై జ్ఞానముద్రనుధరించి, జపశీలుడైన తపస్వియైన నరునికి మంత్రోపదేశము చేసినవారు, పెరియాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము

1. మార్గవసతులు:—తిరుప్పిరుదినుండి 15 మైళ్ళదూరములోనున్న పాండికేశ్వరమునకు 15 మైళ్ళదూరములో నీదివ్యదేశమువున్నది. ఈ మార్గముయొక్కవివరములను ముందుపేజీలో చూడుడు

2. మరియొక మార్గము:—కర్ణప్రయాగనుండి 12 వ మైలునందు ఆదిబదరి, 29 వ మైలునందు సౌరీ, (ఇవ్వేది కార్వాల్ జిల్లాకును, రాంనగర్ జిల్లాకునుయెల్ల. సకల సౌకర్యములునువున్నవి) 37 వ మైలునందు సోగుడియా, 53 వ మైలునందు జెనులా, 58 వ మైలునందు శిర్కుడా మార్గముగా 100 మైళ్ళ దూరములోనున్న రాంనగర్ స్టేషనుకు పోవలయును, రాంగనర్ నుండి బదరికా శ్రమమునకు 167 మైళ్ళు. ఈ మార్గమున మృగములు సంచరించుచుండును. అయినప్పటికిని యాత్రి

ట యూ మృగములు అపాయములను గలిగించవు, భయము లేక పోవచ్చును.

అగ్ని దేవుడు జలరూపముగా పెరుమాళ్ళ తిరువడినుండి పుద్భవించి తప్తగుండం అను పేరు తో ప్రవహించు చున్నారు. దీనికే తప్తగుండ తీర్థమని పేరు, ఇందుస్నానము చేసినవారు సర్వ పాపములనుండి విముక్తులగుదురు. ప్రథమమున తప్తగుండము లో స్నానము చేయకూడదు. అట్లుచేసిన జ్వరము వెంటనేవచ్చును. అందువలన మొదట నారదగుండమను శీతల జానమందుస్నాన ముచేసి పిదప తప్తగుండమయిన అగ్నిగుండమునందు స్నానము చేయవలయును. పండావారి యిండ్లలోదిగుట కన్న సన్నిధిలో సంబంధించిన వారియిండ్లలో దిగుట మిక్కిలి యుత్తమముగా నుండును. బ్రహ్మకపాలమునందు పిండము వేయుటకుగాను తళిగచేయుటకు 1 రూపాయకట్నము యియ్యవలయును. ఇచ్చ టనుండి ½ మైలుదూరములో బ్రహ్మకపాలమువున్నది. ఇచ్చటికి 5 మైళ్ళదూరములో వసుధారయున్నది. అచ్చట పాపులమీద ఒక బొట్టుజలముకూడా పడదట, పుణ్యపురుషుల మీదనే జలము పడునని చెప్పెదరు.

ఈ దేవాలయముయొక్క అర్చక పరిచారకులు మొద లగు పరిజనులు మంచుకాలమువచ్చునప్పుడు అనగా అల్పిశినెల పౌర్ణమినాడు పెరుమాళ్ళకు తిరుమంజనం మొదలగునవి జరిపించి వెన్నను పూతగాపూసి (వెన్నకాప్పు) తిరువారాధనము జరి పించి ధాన్యాదులను భూమియందు భద్రపఱచి సమీపగ్రామప ములయిన పాండ్యకేశ్వరం మొదలగుగ్రామములలో వాసము చేయుచుండి మంచుకాలము పోయినపిమ్మటవచ్చి చిత్రాపూది

మీనాడు సన్నిధితలుపులను తెరచి తిరునాధన చేయుదురు. ఈ కారణముచేత ఈ క్షేత్రమునందు మానవులు ఆఱుమాసములు ఆరాధించునట్లు, దేవతలు ఆరుమాసములు ఆరాధించునట్లును, చెప్పెదరు. ఇందుకు నిదర్శనముగా చిత్రాపౌర్ణమినాడు తలుపులు తీయునప్పుడు అల్పిశి పౌర్ణమినాడు స్వామికినలంకరించిన పుష్పములు కొంచమైనను వాడకుండా యుంచుటయు, అప్పుడు వెలిగించియుంచిన దీపము ఆరకుండా వెలుగుచుండుటయు విస్మయముగావున్నది. దీనిని సేవించుటకు వందలకొలది జనులు ముందుగావచ్చి కాచియుండెదరు.

## 106. సాలగ్రామం.

పరిభావము:—శ్రీమూర్తి పెరుమాళ్ళు, శ్రీదేవినాచ్చియారు, గఘన విమానము, చక్రతీర్థము, గండకీనది, ఉత్తర తిరుముఖమండలము,నిన్నతిరుకోలము, గండికియనువేశ్యకును, బ్రహ్మరుద్రాదులకును ప్రత్యక్షము, పెరియాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము.

మార్గవసతులు:—ఇయ్యది అయోధ్యనుండి మంకాపూర్ (Mankapur) గోరక్‌పూర్ (Gorakhpur) కాప్టన్‌గంజ్ (Captain Ganj) చిటూనీగాట్ (Chetuni Ghat) బగహా (Bagaha) నర్కాటియాగంజ్ (Narkatiaganj) మార్గముగా, బిక్‌నాథోరీ (Bhiknathore) వరకు రైలుమార్గముగా రావలె

యును. కాశీనుండియు పాట్నా, గోరక్‌పూర్ మార్గముగా బిక్నాదోరీకి రావచ్చును. గయానుండి పాట్నా, బంగీపూర్, ముజర్‌పూర్, రక్జాల్ మార్గముగా పిక్నాదోరీకి రావచ్చును. ఇంతవరకే బ్రిటీషు రాజ్యము. పిక్నాదోరీనుండి 80 మైళ్ళదూరములో కత్‌మండూ (Katmandu) వున్నది. ఈ 80 మైళ్ళప్రయాణము చేయుటకు 10 దినములు పట్టును. ఈ కత్మండునుండి సాలగ్రామమునకు పోవుటకు 10 దినములవును. మాఘమాసమున మహాశివరాత్రినాడు కత్‌మండులోనున్న పశుపతినాథీశ్వరుని సేవించుకొని అనేకజనులు సాలగ్రామమునకు పోవుదురు. ఆసమయమందే సాలగ్రామమునకు వారితోడపోవుట యుత్తమము. తతిమకాలమునందు రాజుగారి యనుమతి పొందవలయును, 50 మనుష్యులు చేరకగాని రాజు అనుమతియియ్యరు. దారియందు యేదిన్నిదొరకదు, సౌకర్యములు లేవు. నేపాళరాజుగారి వుత్తరవు లేక పెరుమాళ్ళ సేవ లభ్యము కాదు. ఇచ్చట జలములో సంచరించుసాలగ్రామములు వుత్తమం, కురిజం మధ్యమం. దానిని గమనించితీయవలయును



## 107. తిరుప్పార్ కడల్.

ప్రభావము:—క్షీరాబ్ధినాథుడు, వ్యూహమూర్తి, కడల్ మగళ్ నాచ్చియారు, అష్టాంగవిమానము, అమృతతీర్థము, దక్షిణ తిరుముఖమండలము, భుజంగశయనము, బ్రహ్మరుద్రాదిదేవతలకు ప్రత్యక్షము, పొయ్‌గైయాళ్వారు, పూదత్తాళ్వారు,

పెరియాళ్వారు, తిరుమళిశైయాళ్వారు, నమ్మాళ్వారు, కుల శేఖరాళ్వారు, పెరియాళ్వారు, ఆండాళ్, తొండరడిప్పొడియాళ్వారు, తిరుమంగయాళ్వారు మంగళాశాసనము. దేవతలు, ఋషులు, యోగులు మొదలగువారు పోవుదురు. మనుజశరీరముతో పోవుటకు సాధ్యముకాదు.

ఉత్తరదేశపు తిరుపతులు సమాప్తము.



# 108. పరమపదము - తిరునాడు.

ప్రభావము:—పరమపదనాథుడు, పరవాసుదేవుడు, శ్రీవైకుంఠనాథులు, పెరియపిరాట్టి, ఆనందాఖ్యవిమానము, విరజానది, ఐరమ్మతపుష్కరిణి, సోమసవనము, కూవిళవృక్షము, దక్షిణ తిరుముఖమండలము, పీత్తిరుంద తిరుక్కోలము, అనంత గరుడవిష్వక్సేనులు మొదలగు నిత్యసూరులకు, ముక్తులకు ప్రత్యక్షము, పొయ్గైయాళ్వారు, పూదత్తాళ్వారు, పేయాళ్వారు, తిరుమళిశైయాళ్వారు, నమ్మాళ్వారు, కులశేఖరాళ్వారు, పెరియాళ్వారు, తొండరడిప్పొడియాళ్వారు, తిరుమంగయాళ్వారు, ఆండాళు మంగళాశాసనము.

108- తిరుపతులు సమాప్తము.



# పురాణ స్థలములు

## 1. రాజమన్నార్ కోవిల్ - దక్షిణద్వారక.

ప్రభావము:—రాజగోపాలుడు, శెంగమలవల్లి నాచ్చియారు, స్వయంభు విమానము, హరిద్రానది పుష్కరిణి, శంఖతీర్థము, చక్రతీర్థము, కృష్ణతీర్థము, గజేంద్రతీర్థము, క్షీరసాగరతీర్థము, గోప్రళయతీర్థము, గోపీనాథతీర్థము, చంపకారణ్యక్షేత్రము, తూర్పు తిరుముఖమండలము, నిన్నతిరుకోలము, కోయిల్ గోప్రళయ మహామునికి ప్రత్యక్షము.

మార్గవసతులు:—తంజావూరుకు 20 మైళ్ళ దూరములోనున్న నీడామంగలం జంక్షనుకు 8 మైళ్ళదూరములో నున్న మన్నార్గుడి స్టేషనుకు సమీపమున ఈ దివ్యదేశమువున్నది. సర్వసౌకర్యములునువున్నవి.

## 2. పాపవినాశం.

ప్రభావము:—పాపవినాశపెరుమాళ్ళు, పంకజవల్లి తాయారు, పాపవినాశ విమానము, పుండరీకపుష్కరిణి, తూర్పు తిరుముఖమండలము, నిన్న తిరుకోలము, జయముపొందిన చోళరాజునకు ప్రత్యక్షము.

మార్గవసతులు:—తంజావూరుకు 15 మైళ్ళదూరములోనున్న పాపనాశం స్టేషనుకు ¼ మైలుదూరములో పెరుమాళ్ళ సన్నిధియున్నది. ఈ స్థలమున సౌకర్యములువున్నవి.

# 3. శ్రీ ముష్ణం.

ప్రభావము:—ఆదివరాహ ప్పెరుమాళ్, అంబుజవల్లి నాచ్చియార్, వామన విమానము, నిత్యపుష్కరిణీ తీర్థం, పశ్చిమ తిరుముఖమండలం, చిన్నతిరుకోల్కులం, అశ్వత్థనారాయణు నకు ప్రత్యక్షము.

మార్గవసతులు:—శ్రీముష్ణం అనుటకు బదులుగా శ్రీ ముష్టమనియు జెప్పుదురు, చిదంబరం రైల్వేస్టేషనుకు పడమట 15 మైళ్ళదూరములో స్వయంవ్యక్తస్థలమగు ఈదివ్యదేశమున్నది, బండ్లు, మోటరు బస్సులుగలవు, కాఫీక్లబ్బులు, భోజనశాలలు వున్నవి, సన్నిధియందు ప్రసాదముచిక్కును.

# 4. కాట్టుమన్నార్‌కోవిల్ వీరనారాయణపురం.

శ్రీమన్నాథమునులు, శ్రీయాళవందారులు అవతరించిన స్థలము చిత్రకూటము (చిదంబరం) నుండి పడమట దిశయందు 16 మైళ్ళదూరములో ఈదివ్యదేశ మున్నది, మోటరుబస్సులు, బండ్లువున్నవి, సన్నిధియందు ప్రసాదము చిక్కును. ఇచ్చటికి 7 మైళ్ళదూరములో కురుగై కావలప్పన్ సన్నిధి యున్నది.

# 5. కురుగై కాపలప్పర్ సన్నిధి.

ఇయ్యది శ్రీముష్ణమునకు 7 మైళ్ళదూరము లోను కాట్టుమన్నారు కోవిలనుండి 8 మైళ్ళదూరములోనున్న వున్నది. బండ్లుగలవు.

# 6. మధురాంతకం.

ఏరికాత్తపెరుమాళ్, పెరియనంబిగారు శ్రీరామానుజులకు పంచసంస్కారములు చేసి మంత్రోపదేశము కృపచేసిన స్థలమిదియే. చెంగల్పట్టునకు దక్షిణమున 15 మైళ్ళ దూరములోనున్న మధురాంతకం స్టేషనుకు 1 మైలు దూరములో ఈదివ్య దేశము వున్నది.

# 7. మహాబలిపురము—తిరుక్కడల్‌మల్లై

92. వతిరుపతి యందు చూడుడు.

# 8. తిరుమయిలై (మయిలాపూర్.)

ప్రభావము:—కేశవ పెరుమాళ్, మాధవ పెరుమాళ్, కైరవణి సరస్సు: పేయాళ్వార్ల అవతారస్థలము. చెన్నపట్టణములోనుండు, సెంట్రల్ స్టేషన్ నుండి, ఎగ్మూరు స్టేషన్ నుండి 3½ మైలుదూరములో నున్నది.

# 9. తిరుమళిశై

ప్రభావము:-జగన్నాథస్వామి, తిరుమంగవల్లి తాయారు, తిరుమళిశై యాళ్వారుల యవతారస్థలము. ఇయ్యది చెన్న

పట్టణమునకు పశ్చిమమున 15 మైళ్ళదూరములో నున్నది. చెన్నపట్టణమునుండి పూందమల్లికి, తిరుముఃషికి, శ్రీపెరుంబూదూరుకు, కాంచీపురమునకు బండ్లు, మోటారు బస్సుల రాకపోకలున్నవి.

# 10. పూందమల్లి (పూవిరుందమల్లి)

ప్రభావము:—వరదరాజ పెరుమాళ్ళు, శ్రీనివాసపెరుమాళ్, పుష్పకవల్లి తాయార్, తిరుక్కచ్చినంబి అవతారస్థలము.

మార్గవసతులు:—చెన్నపట్టణమునకు పశ్చిమమున 14 మైళ్ళదూరములోను, ఆవడిస్టేషనుకు 5 మైళ్ళదూరములోను యున్నది. బండ్లు, మోటరు బస్సువులున్నవి. కాపీక్లబ్బులు, భోజనశాలలువున్నవి, సన్నిధియందు ప్రసాదము చిక్కును.

# 11. మొదలియాండాన్ సన్నిధి.

ప్రవము:—పచ్చవణ్ణ పెరుమాళ్ళు, హారీతవారణపెరుమాళ్ళు, అమృతవల్లి తాయారు. ఇయ్యది పూందమల్లినుండి 1½ మైలు దూరములోనున్నది. బండ్లువున్నవి. సన్నిధి యందు ప్రసాదము చిక్కును.

# 12. భూతపురి — శ్రీపెరుంబుదూర్.

ప్రభావము:—ఆదికేశవ పెరుమాళ్ళు, యతిరాజవల్లి తాయార్, అనంత సరస్సు, పుత్తేరి చెరువు, తూర్పు తిరుముఖ మండలము, నిన్నతిరుకోలము, హారీతునకు, ఆసూరికేశవా

చార్యులకు, ఉడయవరులకు, ప్రత్యక్షము, శ్రీ ఉడయవరులయొ అవతారస్థలము.

మార్గవసతులు:—చెన్నపట్టణమునకు పశ్చిమమున 25 మైళ్ళదూరములో నున్ను, తిరువళ్ళూరు స్టేషనుకు అగ్నేయమున 11 మైళ్ళదూరములో నున్ను, కాంచీపురికి ఈశాన్యమున 34 మైళ్ళదూరములోను యున్నది. మోటరు బస్సులు, బండ్లుగలవు, సన్నిధియందు ప్రసాదము చిక్కును, కాఫీక్లబ్బులు, భోజనశాలలు వున్నవి.

# 13. మధుర మఙ్గలం.

ప్రభావము:-గోవింద భట్టర్ అగు ఎంబారుల అవతార స్థలము, శ్రీ పెరుంబూదూరికి నిరుతి దిశయందున్న సుంకువారి చావడికి పశ్చిమముగా 8 మైళ్ళ దూరములోనున్నది. బండ్లు గలవు సన్నిధియందు ప్రసాదము చిక్కును.

# 14. విరింజిపురం.

ప్రభావము:—భక్తవత్సలస్వామి,

విరింజిపురం స్టేషనుకు దక్షిణమున 8 మైళ్ళదూరములో యున్నది. బండ్లుగలవు.

# 15 కూరం.

ప్రభావము:-కూరత్తాళ్వారుల అవతతారస్థలము కాంచీపు:మునకు వాయువ్యమున 7 మైళదూరములో నున్నది.

# 16. శ్రీరంగ పట్టణం.

శ్రీరంగ నాథస్వామి, నరసింహస్వామి, శ్రీరంగ క్షేత్రము వలెనే శ్రీరంగపట్టణమును కావేరీ నది రెండు భాగములుగా చీలి ఆవరించుకొని యున్నది. బెంగుళూరునుండి నిరుతి దిశ యందు 75 మైళ్ళదూరములో శ్రీరంగపట్టణం స్టేషనుకు సమీపమున నున్నది.

# 17. శింజక్ కోట — ఎడత్తురై

శ్రీరాముల వారి మూలవిగ్రహసన్నిధి, సీతాదేవి స్నానము చేసిన స్థలము. ఇయ్యది మైసూరుజిల్లాలో ఎడత్తురై తాలూకాగా యున్నది. శ్రీరంగ పట్టణము నుండి, ఇలివాలా మార్గముగా 23 మైళ్ళదూరములో ఎడత్తురై యున్నది.

# 18. మిథునసాలగ్రామం.

ప్రభావము:—నరసింహస్వామి సన్నిధి, శ్రీరాములతిరువడీగుళ్ళను వేంచేపు చేసియున్న సన్నిధి. శ్రీపాదతీర్థనడబావి యున్నది ఎడత్తురైనుండి 8 మైళ్ళదూరములో నున్నది.

# 19. తిరునారాయణపురం.

# మేలకోట్టై — యాదవాద్రి

ప్రభావము:—దక్షిణ బదరికాశ్రమము, తిరునారాయణప్పెరుమాళ్, శెల్వపిళ్లై, యాదవ నారాయణ ప్పెరుమాళ్,

యదుగిరినాంచారు, యదుగిరి, యాదవగిరి, ఆనందవిమానము, తిరుకల్యాణితీర్థము, వైకుంఠతీర్థము, పరాశర తీర్థము, మైత్రేయ తీర్థము, ధనుష్కోటితీర్థము, యాదవతీర్థము, లోకపావనతీర్థము, పాండవతీర్థము, తూర్పుతిరుముఖ మండలము, నిన్నతిరుక్కోలము, దేవపుష్కరిణి శ్రీరామతీర్థము, నారాయణతీర్థము, గరుత్మంతునకు వైరముడి నిమిత్తముగా ప్రత్యక్షము. నంజియ్యర్ అవతార స్థలము. కొండమీద నరసింహస్వామి సన్నిదియున్నది. పంగుని మాసమందు పుష్యమీ నక్షత్రమురోజున వైరముడి వుత్సవము. ఉడయవరులవల్ల జీర్ణోద్ధారణముచేయబడిన సన్నిధి

మార్గవసతులు:— మైసూరు నుండి 18మైళ్లు. ఫ్రెంచి రాక్సు (French Rocks) స్టేషనుకు 18 మైళ్ళదూరములో ఈ దివ్యదేశమువున్నది, బండ్లు, మోటారు బస్సులు వున్నవి, కాఫీ క్లబ్బులు, భోజనశాలలు వున్నవి.



## 20. తొండనూర్

ప్రభావము:— లక్ష్మినారాయణుడు, శ్రీకృష్ణుడు, మిట్టయందు నరసింహస్వామి సన్నిధి యున్నది, విష్ణువర్ధన రాజు యొక్క కుమార్తెకు పట్టియుండిన బ్రహ్మరాక్షసుని వుడయవరులు పారదోలి స్థలమిదియే. ఫ్రెంచిరాక్సునుండి 4 మైళ్ళు. మేలకోటనుండి 18 మైళ్ళు.

## 21. హంపి – కిష్కింధాపురి.

ప్రభావము: — సీతారాములు, నరసింహులు హనుమంతసుగ్రీవాదులను సంధించినస్థలము, ఋష్యమూక పర్వతము, పంపా సరోవరము, శబరిఆశ్రమము.

మార్గవసతులు:—బెంగుళూరునుండి హుబ్లీ మార్గముగా హాసపేట (Hospet) స్టేషనుకు 8 మైళ్ళదూరములో ఈ దివ్య దేశమున్నది, బంఢ్లుగలవు.

## 22. భద్రాచలం.

ప్రభావము:—శ్రీ రాములు, సీతాదేవి.

ఇయ్యది గుంటకల్లు నుండి రేచూర్, వాడి, హైదరాబాదు, దోరణకల్ మార్గముగా ఎల్లెతలపాడు స్టేషనుకు 25 మైళ్ళ దూరములో నున్నది. బంఢ్లుగలవు బెజవాడనుండి దొరణక్కల్ మార్గముగా ఎల్లెతలప్పాడుకు 93 మైళ్ళదూరము, రాజమండ్రి నుండి గోదావరీ నది యందు పడవల మార్గముగాను భద్రాచలమునకు పోయెదరు.

## 23. పండరీపురము.

ప్రభావము:—పాండురంగవిఠలుడు, విరోభా, రుక్మిణీపిరాట్టి, చంద్రాభాగానది, భీమానది, పుణ్డరీక మహర్షియొక్క ప్రార్థనాను సారముగ ఇటుకరాతిమీద నిలిచియుండు సేవతోనున్నారు, పూర్వము యాత్రవాసులందరు (ప్రతివారును) స్వామిని ఆలింగనము చేసుకొని నారాధించు చుందురు.

మార్గవసతులు:-రేచూరునకు 209 మైళ్ళదూరములో నున్న బార్సీ రోడ్డునకు 31 మైలుదూరములో నున్నది. బండ్లు వున్నవి.

## 24. పఞ్చవటి - నాశిక్.

ప్రభావము:—శ్రీరాముల సన్నిధి, మఱ్ఱివృక్షము క్రింద నున్న గుహాయందుసీతాలక్ష్మణులు, గోదావరీనది, శ్రీరాములు సీతాలక్షణ సహితముగా పర్ణశాలను నమిర్చుకొని వుండిన స్థలము.

మార్గవసతులు:-బొంబాయికి నీశాన్యమున 117 మైళ్ళ దూరములో నున్న, బార్సీరోడ్ నుండి తోండుకామాట్, మార్గముగా 259 మైళ్ళలోను ఈక్షేత్రమున్నది. నాశిక్ స్టేషనుకు సమీపమున 5 మైళ్ళదూరమున నున్నది. లక్ష్మణుడు శూర్పణఖ యొక్క నాశికమును (ముక్కును) ఖండించిన స్థలముగనుక నాశిక్ అను పేరుగలిగినది. ఈ పఞ్చవటి యిప్పుడు చిన్నగ్రామముగా యున్నది. అయిదుమఱ్ఱిచెట్లు గుంపుగా చుట్టుకొని యుండినందున పంచవటి యని పేరుగల్గెను. ఈయైదు వృక్షముల మధ్య స్వరంగమొకటి యున్నది. శ్రీరాములు ఖరదూషణాదులతో యుద్ధముచేయు సమయమున సీతాపిరాట్టిని వుండమని నియమించి లక్ష్మణ పెరుమాళ్ళను ఆమెకు కావలిగాయుంచినట్లు చెప్పెదరు. డబ్బుయిచ్చువారులోపలపోయి చూడవచ్చును. నాశిక్ నుండి 8 మైళ్ళదూరములో గంగస్పురియందు గోదావరీనది కొండమీద నుండి క్రిందపడుటను చూచుటకు

రమ్యముగా నుండును. కాశికకు 20 మైళ్ళదూరములో గోదావరినం వుత్పత్తి స్థానమైన త్ర్యింబకమున్నది.

## 25. పాటలీపురము - పాట్నా

## అవంతి కాపురి.

కాశీనుండి మొగల్‌శిరే-మాంగీపూర్ మార్గముగా 107 మైళ్ళువున్నది. ఉజయిన్ (ఉజ్జయిని) రైలుస్టేషనుకు సమీపం.

## 26. గయా.

---

ప్రభావము:-విష్ణుపాద సన్నిధి, ఫల్గుణనదికి సమీపమున వైకుంఠం అను దివ్యస్థలము. విష్ణుకేదా దరరూపం, పరమపిత్రు స్వరూపముగా నుండి శ్రార్థములను అంగీకరించెదరు. అక్షయ వటవృక్షం విష్ణు పాదసన్నిధి నుండి 1 మైలు దూరములో కేదార ధరస్వామికోవిల్ నున్నది. చంపకారణ్యం 5 లేక 6 మైళ్ళ దూరములోనున్నది. సామాన్యులున్ను ఫల్గుణీనదియందు స్నానముచేసి శ్రాద్ధములుచేసి విష్ణుపాద మందు పిండప్రదానముచేయుదురు. అదియే చాలు ననెదరు.

మార్గవసతులు:—కాశినుండి 142 మైళ్ళదూరములో నున్న బంగీపూరునకు 57 మైళ్ళదూరములోనున్న గయా రైల్‌వే స్టేషనుకు సమీపం.



# 27. పూరీ – జగన్నాథం.



ప్రభావము:-శ్రీబలరాములు, శ్రీకృష్ణమూర్తి, సుభద్ర, నిన్నతిరుకోవిలం, ఈదివ్యదేశమందు శ్రీపద్మనాభం, శ్రీకూర్మం, శ్రీనరసింహ్మం యను మూడుసన్నిధు లున్నవి. ఇచ్చట 12 యేండ్ల కొకసారి కుంభాభిషేకం జరుగును, ఇయ్యది హిందూదేశము యొక్క తూర్పు వొడ్డుననున్న పురాతనక్షేత్రము. ఇయ్యది సముద్రతీరము నందున్న పట్టణము. ద్వాపర యుగాంతర మందు దుష్ట నిగ్రహ శిష్టపరిపాలనముచేయుటకు శ్రీకృష్ణమూర్తి మదురా పురియందు అవతరించివారు చేసిన లీలా వినోదములను తెలియ నివారులేరు. అర్జునునికి హితోపదేశముచేసి భారతయుద్ధమును జరిపించిరి, భూభారమును నివారించిరి. ఇష్టులను రక్షించిరి. కలి యుగములో ప్రత్యక్ష దైవముగా జగన్నాథమందు వేంచేసి భక్తులకు సేవసాయించు చున్నారు. ప్రతిసంవత్సరము ఆడి మాసమందు వీరికి జరుగురథోత్సవమునకు లక్షలకొలది జనులు శేవించుటకు వచ్చెదరు ఇచ్చట స్వామికి నైవేద్యమగు ప్రసాద ములు, స్వామి ధరించు తుళసీమాలను ఆచారాదులను పరిశీలిం చక గ్రహించెదరు. ఇయ్యది చాలపురాతనమైన సన్నిది. ఇచ్చట వసించు జనులు, ఓడ్రభాష మాట్లాడుదురు. కలకత్తాకు 248 మైళ్ళ దూరములో నున్న కటకమునకు 60 మైళ్ళ దూరములో ఈక్షేత్ర మున్నది. బెజవాడానుండి మచిలీపటణం, రాజమంద్రి, విశాఖ పట్నం, గంజాం మార్గముగా 488 మైళ్ళ ధూరములో నున్న జగన్నాధం స్టేషనుకు సమీపం.

# 28. బృందావనం.

ప్రభావము:— రాధావల్లభుడు, రాధాదేవి, వస్త్రాపహరణతీర్థము, తూర్పుతిరు ముఖమండలం, నిన్నతిరుక్కోలము, రాధాదేవికిప్రత్యక్షము.

తతిమ వివరములను 101 వతిరుపతి యగు వుత్తరమధుర విషయమునకు పిదప వ్రాసియున్నాము.

# 29. గోవర్ధనం.

ప్రభావము: — గోకులనాథుడు, శ్రీహరినాథుడు, శ్రీరాధాదేవి, పర్వతవిమానము, మానసగంగ, బ్రహ్మతీర్థము, రాధాతీర్థము, కాళింగ మడుగు, గోవర్ధన పర్వతం, తూర్పు తిరుముఖ మండలం, నిన్న తిరు క్కోలం, యాదవులకు, ఇంద్రునకు ప్రత్యక్షము.

మిగత వివరములను 101 వ తిరుపతి యయిన వుత్తర మధురయొక్క వివరములను చూడుడు.

# 30. ఢిల్లి—ఇంద్రప్రస్థం.

ప్రభావము: — పంచపాండవులు రాజ్య పరిపాలనము చేసినస్థలము.

క్రీస్తుపుట్టడమునకు 50 సంవత్సరములకు ముందు డిల్లి అను రాజువల్ల కట్టబడినదగుట చేత దీనికి డిల్లి యనిపేరు గలిగెను. క్రీస్తు పుట్టినవెనుక 1640 వ సంవత్సరమందు షాజీహాఅనువారివల్ల మరల దానికి జీర్ణోద్ధారణము చేయబడినది, విక్టోరియా రాణిగారికి ముందు ఈ నగరమును సుల్తాన్ రజీయారాణిగారు పరిపాల నను చేయు చుండెను. డిల్లీపట్టణము వ్యాపారము నందు ప్రసిద్ధి కెక్కినది, డిల్లికిపక్కన యమునానదియందు కట్టబడినవంతెన 2640 అడుగులపొడవు. ఈ వంతెన మీదుగా, పై భాగమందు రైలుబాటయును క్రిందిభాగమున బండ్లబాటయు అమర్చబడి యున్నది. దీనిని 1867 వ సంవత్సరం జనవరినెల మొదటితేది నాడు కట్టి ముగింపబడినది, ఈవంతెనను కట్టుటకు 1660355 రూపాయలు ఖర్చాయెను.

మార్గవసతులు:— ఆజ్మీర్ నుండి జయపూర్ మార్గ ముగా 275 మైళ్ళదూరములోనున్న డెల్లి రైల్వే స్టేషనుకు సమీపము, ఉత్తరమధురనుండి హత్రాస్, అళిగర్, కాజీబాదు మార్గముగా 126 మైళ్ళదూరము డెల్లి రైల్ వేస్టేషనుకు సమీపము.

---

# 31. హరిద్వారం-మాయా-యమునానది.

ప్రభావము:—ఆదినారాయణుడు, ఆదిలక్ష్మి, ఆనంద విమానము, హరిపాగతీర్థము, గంగానది, బుజంగశయనము, దక్షిణశిరముఖమండలం, దక్షప్రజాపతి నిమిత్తముగా బ్రహ్మ

రుద్రాదులకు ప్రత్యక్షము, శుకమహర్షి, పరిక్షిత్ మహారాజు తపస్సుచేసిన స్థలము, తతిమవివరములను 103 వ తిరుపతియగు కండమెన్నుం కరినగర్ (దేవప్రియాగ) విషయము నందు చూడుడు.

## 32. హృషీకేశం.

మార్గము:-హరిద్వారము నుండి 15 మైళ్ళదూరములో నున్నది. ఇచ్చటనుండి చూచినహిమవద్గిరి పర్వతము చక్కగా తెలియును. గంగానదీ తీరమునకు పైగాయున్నది.

## 33. భరత్వాళ్వార్ ఆశ్రమం.

హృషీకేశమునకు సమీపముగానే యున్నది. ఈమార్గముగా పోయిన తపోవనము చేరవచ్చును.

## 34. తపోవనము.

ఇచ్చట లక్ష్మణుల సన్నిధియున్నది. ఇయ్యది హిమాచల పర్వతమునకు పోవుమార్గములో నున్నది. దీనికి సమీపమున దేవప్రయాగ (కండమెన్నుం కిటిలగర్) యున్నది.

## 35. శ్రీనగరము

ఇచ్చట గంగ యమున వుత్పత్తియగు చున్నవి. ఇయ్యది దేవప్రయాగకు సమీపమున నున్నది, హరిద్వారమునుండి సహారన్పూర్, లాహూర్, మార్గముగా 389 మైళ్ళదూరములో నున్న జీలం స్టేషను నుండి రాజబాటమార్గముగా 100 మైళ్ళ

దూరములో శ్రీనగరమున్నది. హరిద్వారము నుండి రాజబాట మార్గముగా 240 మైళ్ళదూరములో శ్రీనగరమున్నది.

# 36. ఉజ్జయినీ పురము.

ప్రభావము:—రాధాకృష్ణుని సన్నిధి, కశ్యపవంశోద్భవుడైన సాందీప మహర్షి జనించిన స్థలము. శ్రీకృష్ణమూర్తి సాందీపుని యొద్ద విద్య నభ్యసించిన స్థలము.

మార్గము:—ఇంధూర్ (Indoor) నుండి పటయాబాద్ (Fateabad) మార్గముగా 39 మైళ్ళ దూరములో ఉజ్జయినీపురమున్నది. బొంబాయినుండి మన్మాట్, భుసావల్, ఖణ్డ్వా మార్గముగా 440 మైళ్ళదూరములో ఈ స్థలమువున్నది. రైల్వే స్టేషన్ ఉజ్జయన్.

# 37. అవంతికాపురి పర్వతము.

దీనికి ప్రక్కనవున్న నారాపసి పర్వతము నందు సుధాముడు (కుచేలముని వరుండు) జనించెను. ఇయ్యది ఉజ్జయినికి 14 మైళ్ళ దూరములో నున్నది.

# 38. తాకూర్.

ఇచ్చటనున్న కృష్ణమూర్తి విగ్రహము, ద్వారకనుండి తేబడినది. బొంబాయికి 247 మైళ్ళదూరములోనున్న బరోడాకు 41 మైళ్ళదూరములో తాకూర్ వున్నది.

పురాణ స్థలములు సమాప్తము.